శ్రీమద్వేణుగోపాలస్వామినే నమః

# శ్రీరామచరిత్రము



## నిర్వచనకావ్యము

షట్కాండసంఘటితము



గ్రంథకర్త్రి

దేచిరాజు [illegible] నరసమ్మ

గుంటూరు

*

ద్వితీయ ముద్రణము

500 ప్రతులు




ప్రకాశకులు:

దేచిరాజు రామారావు

పాతగుంటూరు

1937




[వెల 10 అణాలు

# విజ్ఞాపనము



ఆర్యులారా !

బాలికాబాలకులకు సులభశైలితో వాల్మీకరామాయణమునందలి కథం దెలుపందలంచి, శ్రీసీతారామానుగ్రహంబున నెట్లో యీ "శ్రీరామచరిత్రము"ను విరచించితిని. పండితోత్తములగు మీ రెల్లరు నిందలి లోపములను క్షమించి యాదరింప వేడుచున్నాను.

అల్పజ్ఞ నగునాచే రచింపంబడిన యీచిన్నిపొత్తము నవ్యాజవాత్సల్యముతో నామూలాగ్రంబుగ బరిశీలించి యాశీర్వదించిన బ్రహ్మాండపురాణాంధ్రశ్రీమద్రామాయణాద్యనేకగ్రంథకర్తలును, కావ్యస్మృతితీర్థ, కళాప్రపూర్ణ బిరుదాంకితులును నగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మ గారికిని, ఆంధ్రయూనివర్సిటీప్రొఫెసర్ బ్రహ్మశ్రీ పింగళి లక్ష్మీకాంతము పంతులుగారికిని, విద్వత్కవివర్యులగు బ్రహ్మశ్రీ గుఱ్ఱప్పడియ ఆంజనేయులుగారికిని, బ్రహ్మశ్రీ కవిజనారాధ్య వాజపేయయాజుల రామసుబ్బారాయ, వేంకటనారాయణ సోదరకవీంద్రులకును గృతజ్ఞతాపూర్వకంబుగ వందనశతంబులు సమర్పించుచున్నాను.

ఇట్లు విన్నవించు
విబుధవిధేయ,
దేచిరాజు లక్ష్మీనరసమ్మ.

శ్రీరామాయ నమః

# తొలిపలుకు



మానవలోకాభ్యుదయసాధకంబులగు బహువిధపరికరములలో "సాహిత్య"మత్యుత్తమ మైనది. సాహిత్యవంతమగుజాతియె "సభ్యజాతి" యనిపించుకొనఁజాలియుండును. కాలానుగుణ్యముగ నాయాదేశంబుల మహాకవులు తమదివ్యరచనలచే సాహిత్యవల్లికం బెనిచి దేశమాతను సేవించుచుండుట విశ్వచారిత్రమునఁ బరిపాటి.

## కావ్యము

అట్టి "సాహిత్యసుధ"కుఁ గావ్యపయోనిధి పుట్టినిల్లు. సాహిత్యనిలయమగు గావ్యము వ్యంజనావ్యాపారముచే బాఠకునిహృదయము నాకర్షించి, యనిర్వచనీయానందముం గూర్చి, యక్షరపరబ్రహ్మమునం దైక్యము నొందింపఁజాలియున్నది. కావుననె త్రివిధశాస్త్రంబులను గావ్యమున కగ్రతాంబూలము నొసఁగినారు లాక్షణికశిరోమణులు.

## వస్తువు

స్వర్ణమయమగు నిట్టికావ్యమున కమూల్యమగు కథారత్నము లభింపవలయును. అప్పు డది విశ్వకల్యాణప్రదమై, భాషాసతీవిభూషణములం దగ్రగణ్యమై విలసిల్లును. ఇవ్విధంబునఁ గథారత్నమును సువర్ణరాజితోఁ బొందుపఱిచి

నైపుణ్యంబు వెంపునఁ గావ్యచూడామణులను సృష్టించి, వాఙ్మయవిశ్వవైభవమును వర్ధిలఁ జేయువాఁడు కవిబ్రహ్మ.



## కవి

రసోచితంబులగు భావములను, భావానుగుణ్యంబులగు రీతులను, రీత్యనుకూలంబులగు పదవర్ణక్రమంబును స్వేచ్ఛగ వెలువరించుచు, విశ్వమోహినియగు కవితావిలాసినిని విధేయం గావించికొని, కావ్యరూపమున విశ్వశ్రేయము నాపాదించుకతన కవి విశ్వవిహితుఁడు, విశ్వారాధ్యుఁడు, విశ్వసేవకుఁడు, విశ్వాధికుఁడు. అతఁడు దేశారాధకులయందు దేశారాధకుఁడు, భగవద్భక్తులయందు భగవద్భక్తుఁడు, రాజకీయవేత్తలలో రాజకీయవేత్త, బోధకులలో బోధకుఁడు. ఇంత యేల; జగత్సౌభాగ్యహర్మ్యమున కవియే పునాది. అతఁడె మహాత్ముఁడగు ఋషి. "నానృషిః కురుతే కావ్య" మ్మని యార్యులు చెప్పియే యుండిరిగద.

## ఆంధ్రకవులు — కవయిత్రులు.

ఏవంవిధగుణసంపన్నములగు కావ్యములకును, కవివర్యులకును ఆంధ్రవాఙ్మయమునందు భాగ్యవిశేషమునఁ గొదువ లేకున్నది. పురుషపుంగవులకుఁ దీసిపోని భక్తివిశ్వాసములును, ప్రజ్ఞాకౌశల్యములును రాణింపఁ బలువురు సతీమతల్లులుగూడ వాక్పవిత్రీసపర్యఁ గావించుచుండుట మనకు సంప్రదాయము. ఆంధ్రవాఙ్మయాస్థానంబున మోహనాంగి,

మొల్ల, వెంగమాంబ, మున్నగు కవయిత్రుల కొసఁగఁబడి యున్న యంతరువు సామాన్యమైనది కాదు.

## —♦ గ్రంథకర్త్రి ♦—

ప్రబంధరచన సన్నగిలుచున్న యీయధునాతనయుగమునం దాంధ్రసరస్వతి నలంకరింపఁ దొరకొని, విద్యార్థిజనోపయోగముగఁ బూర్వసంప్రదాయమును పాటించి, పవిత్రము లగుసచ్చరిత్రములను బ్రబంధరూపమున విరచించి, భాషాసేవఁ గావింపఁబూనిన యుత్తమకవయిత్రీమణులలోఁ బ్రకృతగ్రంథకర్త్రి "శ్రీమతి దేచిరాజు లక్ష్మీనరసమ్మగా" రొకరు. ఈయమకవిత్వము రసవంతమై, నిర్దుష్టమై, ధారాశుద్ధిం గలిగి, ద్రాక్షామధురముగా నుండును. ఇందు స్వాభావికస్థితియుఁ (Realism), క్రమవిధానము (Regular Method) ప్రాధాన్యంబు నొందినవి. ఈవిదుషిచే నింతకుమున్నె 'కుచేలోపాఖ్యానము ; శ్రీరామశతకము ; యుధిష్ఠిరచక్రవర్తి ' మున్నగు పొత్తములు ప్రణీతములై యున్నవి. తగుప్రోత్సాహము కల్గినేని యీసుశీల యింకను మాన్యతరములగు నుద్గ్రంథములను విరచించి, వాఙ్మయోపకృతిఁ గావింపఁగలదని మావిశ్వాసము. ప్రకృతవిషయమైన సత్ప్రబంధము, నిర్వచనము, పరమపవిత్రము, భారతీవిభూషణము. "శ్రీరామచరిత్రము" వీరిచే రచింపఁబడిన పద్యకావ్యంబులలో నొకటి. ఇది భాషాంతరీకరణము (Translation) గాదు. సంక్షిప్తరచనము,

(abridgment). ముఖ్యాంశములను ససంఖ్యముగఁ దెలుపుచు రామాయణషట్కాండగాథ యంతయు నిందు సుమారు 400 పద్యములలో నిముడ్పఁబడినది. ఇందలి "మహాబ్ధి సార్ధదినమునం జేరుట," "సేతువు నైదుదినములలో నిర్మించుట," "సమరసప్తాహము" మున్నగునంశము లాంధ్రీకృతరామాయణవాఙ్మయమునం దపూర్వములు.

కవిసామాన్యములగు నర్ధబిందువ్యత్యయము, రేఫద్వయసాంకర్యము, కుషష్టి, వైరిసమాసము మున్నగుఛందో వ్యాకరణదోషము లిందు మందునకైనఁ గానరావు. కైశికీవృత్తియు, వైదర్భీరీతియు రచనయం దనుసరింపఁబడినవి. గ్రంథమం దెల్లెడలను సందర్భోచితమృదుమధురశైలికిం బానటగ సముచితవర్ణనలును, అందందుఁ బ్రాయికముగఁ బాండితీస్ఫోరకములగులక్షణలక్ష్యవిశేషములును బొడగట్టుచు సహృదయుల హృదయముల కింపు నింపుచున్నవి. ఉదా:- నగరవర్ణనము (1-18), వర్షర్తువర్ణనము (4-24), చంద్రికావర్ణనము (5-10), యుద్ధవర్ణనము (6-24) అహల్యాస్తవము - లక్ష్మణుని శ్రీరాముఁ డనునయించుట (2-34), సీతారామవిహారము (3-5), శ్రీరామునిగూర్చి సీత విలపించుట (5; 32-36), ఛందోవిశేషములకు, అంగనయనుచుఁ గృ+పాళుఁడగుచు(1. 43); విభుని జేయుటజనా+భీష్టమరయు (2-2) మృదుసుభాషణుఁ డలఘుజి + తేంద్రియుండు (2-5) మొదలగునవి.

## కథావస్తుగౌరవము - రామాయణప్రశంస.

ఇందు గథానాయకుఁ డేకపత్నీవ్రతుఁ డగు పరమ పురుషుఁడు. నాయిక యాదర్శపతివ్రతామణియగు జగజ్జనని. దాంపత్యధర్మము, గురుభక్తి, భాతృవత్సలత, సేవాధర్మము, మిత్రలాభము, స్వార్థత్యాగము మున్నగుసద్గుణంబు లుద్ఘోషితంబులు. సంస్కృతవాఙ్మయముననేకాక ద్రవిడ వాఙ్మయంబునఁగూడఁ బరిపూర్ణదశ నందినయాదిమకావ్య రాజములు రామాయణవస్తుకములే. ఆంధ్రమునందు భాస్కరరామాయణమాది నేఁటిదనుక నెందరో రామాయణగాథను బలువిధముల విరచించి ధన్యులై యున్నారు. "చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరం."

## గ్రంథోపయోగము.

"ఇన్ని గ్రంథములు రామాయణకథాత్మకంబులై యాంధ్రంబున నుండ మఱల నీగ్రంథమునకుం బ్రసక్తి యేల ?" యని శంకింపఁజనదు. శ్రీరామచరిత మొక్కొక్క గ్రంథమునం దొక్కొక్కనూతనశక్తిం బొరసి తద్జ్ఞులచే గౌరవింపఁబడుచున్నది. అవ్విధంబున నిందును నవీనమగు నొండొకచెన్నుం గల్గియె యున్నది. ఆంధ్రవాఙ్మయమునం దింతవఱకు రచితములగు రామాయణములలోఁ గొంత సంగ్రహరూపమగు ప్రబంధ మొక్క "మొల్లరామాయణమే." అదియైనను "శ్రీరామాయణకథాసందర్భకాల గణనాదికము" మున్నగుముఖ్యవిషయములం గొన్నిటి

విడిచి, గ్రంథబాహుళ్యముం గల్గియె యున్నది. ఇఁక బ్రస్తుతగ్రంథమన్ననో, రచనానైపుణ్యమున మొల్లరామాయణమున కించుకయుఁ దీసిపోక, మిక్కిలి సంగ్రహరూపమయ్యుఁ గథాంశములనెల్ల ససంఖ్యముగ విశదీకరించుచు, శ్రీమద్రామాయణానుసారియై, చదువరులకుఁ గొంగుబంగారమువలె నున్నది. రామాయణ మివ్విధంబున నింతకుమున్నెవ్వరిచేతను విరచింపఁబడి యుండలేదు.

తెలుఁగునుడువునఁ దొలుత రామాయణరచనముఁ గావించిన "భాస్కరమంత్రి"కిం గాణాచియగు "ప్రాగ్గర్తపురి" (ప్రాఁతగుంటూరు) యందె కొంజన్నాళ్లో నేఁడు మఱల నేతత్కవయిత్రీమణిచే "శ్రీరామచరిత్రము" సంప్రణీతమై, యీతూరి నరపతులను విడిచి నారాయణు నాశ్రయించి కృతార్థమగుట మిక్కిలి ముదావహము.

ఈయుత్తమగ్రంథము "మొల్లరామాయణము" వలెనే "విశ్వవిద్యాలయపరీక్షలకుఁ బఠనీయముగ నియమింపఁబడఁదగియున్నది. విద్యార్థు లిట్టిమేల్మిపొత్తములను జదువుట వలన భాషాజ్ఞానమును, నైతికజీవనమునుమాత్రమెగాక సంక్షిప్తరచనావిధానమునుగూడఁ దెలికగ నలవఱుచుకొనఁ గల్గుదురు. ఇట్టిసత్కృతుల నింకను రచించి, వాఙ్మయసపర్యఁ గావించుటకై వాగ్దేవత యీకవయిత్రీమణికి సదవకాశములం గల్గించుఁగాత ! వీరికుటుంబమునకెల్లఁ బరాత్పరుఁడు నిరంతరము దీర్ఘాయురారోగ్యసౌఖ్యముల నొసంగి రక్షించుఁగాత !

# పండితాభిప్రాయములు

సోదరీమణీ !

తమ రచించిన "శ్రీరామచరిత్రము"ను దుదముట్టఁ జదివితిని. శైలి మిక్కిలి మనోహరముగ నున్నది. భక్తి రసము సంపూర్ణముగా వెలయుచున్నది. సులువుగాఁ గవనము సాగినది కాని శ్రమపడి యల్లినజాడ కానరాదు. ఈకృతి నలుదెసల వ్యాపించి శ్రీరామప్రసాదమునకుఁ బాత్రమై శాశ్వతకీర్తి నాపాదించుఁగాత మనియాసించుచున్నాఁడను. పరాత్పరుఁడు దీనబంధువు నగుశ్రీరామమూర్తి మీపాల వెలయుఁగాక! ఇంక నిట్టిగ్రంథరత్నముల నొనరించి మీరు స్త్రీలోకమున కత్యంత శ్రేయస్సు నొసంగుదురుగాక !

శ్రీ శ్రీ శ్రీ

ఇట్లు శ్రేయోభిలాషి,
జనమంచి శేషాద్రిశర్మ.

---

శ్రీమతి దేచిరాజు లక్ష్మీనరసమ్మగారు రచించిన శ్రీరామచరిత్రమనెడికావ్యమును నేను సాంతముగాఁ జదివి సంతోషించితిని. కవిత్వము లలితమై, యింపు నింపుచున్నది. కథ, సంక్షిప్తమయ్యు, వెలితిలేనిరీతిని గూర్పఁబడినది.

పింగళి లక్ష్మీకాంతం.

---

శ్రీమత్పరదేవతాయై నమః.

# అభినందనము



శ్రీమతి దేచిరాజు లక్ష్మీనరసమ్మగారికి బహుళాశీః కలితముగ లిఖించునది.

సోదరీమణీ !

మీరు దయాపూర్వకముగఁ బంపిన "శ్రీరామ చరిత్ర" మనుగ్రంథము నామూలాగ్రముగఁ జదివితిని. మా పరమగురువర్యులును నాంధ్రసాహిత్యచక్రవర్తులును నగు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనృసింహకవిచంద్రముల "ముదితల్ నేరఁగరానివిద్య కలదే ముద్దార నేర్పించినన్" అనువాక్యము మీయెడ సార్థకమైనదని తలంచితిని.

సంగీతము, చిత్రలేఖనము, కవిత్వము మొదలగు లలిత కళలు స్త్రీలకుఁ బెట్టనిసొమ్ములు. అందతిమార్దవం బగు కవిత్వ మనాదినుండి స్త్రీలయందంతర్గర్భితమై యున్నదని చెప్పుటకు మొల్ల, తరిగొండ వేంకమ్మ, మధురవాణి మొదలగు ప్రాచీనకవయిత్రులే సాక్షులు. స్త్రీలు విద్యావతు లగుటయేకాక విద్యాకల్పఫలభూతమగుకవిత్వముం బడయఁ గల్గుట మిక్కిలి శ్లాఘ్యము. ఆపైన సరస్వతీకటాక్షము చేతను, బూర్వజన్మసుకృతవిశేషముచేతను లభించిన కవిత్వమును భగవత్పరముగఁ గృతులు వ్రాసి వినియోగించుభాగ్య మెక్కుడుగ స్త్రీలయందే గన్పట్టుచున్నది.

“రాఘవేశ్వరుచారిత్రము నెంద ఱెన్ని గతులఁ వర్ణించి
నఁ గ్రాలదే?”
“ ... ... ... ... జానకీ
జానికథల్ రచింపకయ సత్కథ లెన్ని రచించెనేనియుఁ
వానివివేక మేమిటికి వానికవిత్వమహత్వ మేటికిఁ?”

అను కంకంటిపాపనార్యుని సుభాషితంబు లూఁతఁగాఁగొని లోకోత్తరగుణరత్నాకరుండును, లీలామానుషవిగ్రహుండును బరదైవమును నగు శ్రీరామునిచరిత్రకై మీకలము నారాధించి చక్కని ధారాశుద్ధితో, మృదుమధురము లగు పదములతో, మనోహరమగు శైలితో, లలితమగు నడకతోఁ గావ్యమంతయు నొకేవిధముగ రచించి మీరు తరించుటయే కాక పాఠకులనుగూడఁ దరింపఁజేసితి రనుట సత్యదూరము గాదు. అరుగ రాఁచినకొలఁదిని బరిమళ మతిశయించు శ్రీ చందనపుఁజెక్కవలెఁ బ్రతిపద్యము రసస్ఫురణము గలిగి గంభీర భావగర్భితమై యలరారుచున్నది.

మీ రిదివఱలో రసవంతముగ రచించిప్రకటించి యాంధ్రసారస్వతలోకమున కందఁజేసిన ముద్దులుమూట గట్టు మూడాశ్వాసముల శ్రీకుచేలోపాఖ్యానమను చక్కని గ్రంథరాజమునుగూడఁ జూచి మిక్కిలి యానందించితిని. మీకవిత్వము శిరీషకుసుమపేశల మనియు మీభావములు కడు గంభీరము లనియు, మీరచన సుప్రసిద్ధపదభూయిష్ఠ మనియు, మీకవితాధోరణి ధారాళమనియుఁ జర్వితచర్వణముగఁ జెప్పుటకంటె బాలబాలికల కత్యంతము పాఠ్యగ్రంథములుగ నుపయోగింపఁబడుట కర్హములై, నీతిదాయ

కములై, భక్తిజ్ఞానవైరాగ్యమోక్షసాధకములై, తనరారు మీగ్రంథములయందలి పద్యములఁ గొన్నింటి నుదాహరించిన నాయాపట్టులయందుఁ బాత్రౌచిత్యమును రసపోషణమును నెట్లు గావింపఁబడినదో తెలిసికొనుట కవకాశముండు ననునమ్మకముతో నీదిగువఁ దత్ప్రయత్నమును గావింతు.

శ్రీరామచరిత్రము I-57, II-31, 34, 50. V-3.
VI-36, 37, 64, 65.

శ్రీకుచేలోపాఖ్యానము I-37. II-40. III-33, 47.

స్త్రీలెల్లరును విద్యావతులై, జ్ఞానసంపన్నలై, సాధ్వీశిరోరత్నములై తనరారిననాఁ డాంధ్రదేశమున నెల్ల యాంధ్రగృహముల 'లలితసాహిత్యసాహిత్యలక్ష్మి' నిండుకళలతోఁ దాండవమాడుననుటకు సందియం బేమి?

ఈనాఁడు స్త్రీవిద్యాసంవర్ధనాభిమానమే పరమధర్మమనియెంచి మిమ్ములను బ్రోత్సహించి సద్గ్రంథరచనము సాగింపఁజేసిన మీభర్తయగు మహారాజశ్రీ దేచిరాజు రామారావుగారు పురుషప్రపంచమున కలంకారప్రాయులు.

పరమేశ్వరుఁడు మీకుఁ జిరాయుర్భాగ్యసౌభాగ్యసంపత్తులును నిట్టిసద్గ్రంథములను రచించుసద్బుద్ధిని బ్రసాదించి సంరక్షించుఁగాక !

కొల్లాపురము, జటప్రోలు సంస్థానము.

ఇట్లు బుధజనవిధేయులు,
వాజపేయయాజుల రామసుబ్బారాయ
వేంకటనారాయణసోదరకవులు,
స్నేహలతాకవితాసంఘాధ్యక్షులు.

శ్రీః

శ్రీమద్వేణుగోపాలస్వామినే నమః



# శ్రీరామచరిత్రము



## బాలకాండము





రాజిల్ల ధరాత్మజారమణితో
సింహాసనాసీనుఁడై
భారద్వాజవసిష్ఠనారదులు సం
భావింపఁగాఁ జిత్కళా
ధీరస్వాంతుఁడు మారుతాత్మజుఁడు భ
క్తిన్ వేదతత్త్వార్థముల్
గారుణ్యంబునఁ దెల్పు రామవిభుఁ డీ
కావ్యంబు రక్షించుతన్. 1

శా. శ్రీరమ్యం బగులోకరక్షణకళా
శ్రీ లొప్ప విఖ్యాతగుం
టూరున్ బాలనసేయు భక్తవరదున్
యోగీంద్రవంద్యున్, రమా

నారీసంయుతు, వేణుగాననిరతున్
నందాత్మజున్, సర్వలో
కారాధ్యున్, నిజభక్తిసాధ్యు, గుణకా
లాబాధ్యు సేవించెదన్. 2

చ. అనయము సత్యలోకమున ♦ నంబురుహాసనుఁ గూడి భక్త
జనవున నేలుమజ్జననిఁ ♦ జంపకగంధిని భారతీసతిన్ లన్
వనజవిపంచికాశుకశు ♦ భంకరపుస్తకపాణి, వాణి నా
మనమున నిల్పి, కొల్చెదను ♦ మంజులసూక్తిసుధోపలబ్ధికై.

క. ప్రాంజలినై మది నిల్పుచుఁ
గుంజరముఖు, దోషవిముఖు ♦ గురువిఘ్నములన్
భంజించి భక్తవరులను
రంజింపంజేయువిఘ్న ♦ రాజున్ దలఁతున్. 4

గీ. సాధుశీలు, నిరంతర ♦ సత్యలోలు,
నిర్మలాచారు, నేకప ♦ త్నీవిహారు
నామనోహరుపదనళి ♦ నద్వయంబు
భక్తి ననయంబు సేవింతు ♦ భావమందు. 5

సీ. వనజాసనసమాను ♦ వల్మీకనందను
ద్వైపాయనుని వేద ♦ తత్త్వవిదుని
బహుళశాస్త్రజ్ఞాన ♦ భానుని, బాణుని
ఘనకవిత్వవిభాసుఁ ♦ గాళిదాసు

నున్నతధీధుర్యు ♦ నన్నయభట్టార్యుఁ
దిక్కనకవినాథు ♦ ధీసనాథు
విమలయశోధను ♦ విజ్ఞానభూషణు
బమ్మెరపోతన ♦ భక్తవర్యుఁ

తే. గీ. బరమసత్కవిగణముఖ్యు ♦ భాస్కరాఖ్యు
సరసవాక్ప్రౌఢిమమునకై ♦ సన్నుతించి
విపులకవితాధురీణలై ♦ వెలయుమొల్ల
వేంగమాంబాదిసతులకు ♦ వినతు లిత్తు. 6

తే. గీ. అరసి మృదుభాషణముల న ♦ న్నాదరించి
సందియంబులఁ దీరిచి ♦ సమ్మదమిడు
వందనీయను గుడిపూడి ♦ యిందుమతిని
బరమకవయిత్రి ననయంబుఁ ♦ బ్రస్తుతింతు. 7

ఆ. వె. వందనము లొనర్తుఁ ♦ బండితోత్తములార !
శాస్త్రముల నెఱుంగఁ ♦ జకిరియందు
భక్తికతన దీని ♦ వ్రాయఁబూనితి దయ
నెన్నవలదు తప్పు ♦ లన్నలార ! 8

## —* షష్ఠ్యంతములు *—

కం. నరసఖునకు స్మితముఖునకుఁ
గరిరక్షణతత్పరునకు ♦ ఖగగమనునకున్
సురనాయకవందితునకుఁ
గరుణాభరణునకుఁ గంస ♦ గర్వహరునకున్. 9

క. పంచజనదనుజహరునకుఁ
బంచాయుధజనకునకుఁ బ్ర ♦ పంచమయునకున్
బంచాననవిక్రమునకుఁ
బంచాననవందితునకుఁ ♦ బరమాత్మునకున్. 10

క. వారాశిగర్వహరునకు
సారసనాభునకు, సత్య ♦ సంకల్పునకున్
క్షీరార్ణవఖేలనునకు
వారిదవర్ణునకు, వనజ ♦ భవజనకునకున్. 11

క. మురహరునకు, బుధనుతునకు
సరసగుణాఢ్యునకు, శంఖ ♦ చక్రధరునకున్
శరధిసుతావల్లభునకు
సరసిజనయనునకు నిగమ ♦ సంచారునకున్. 12

క. గోవర్ధనధరునకు భ
క్తావనునకు, సర్పదర్ప ♦ హరనిపుణునకున్
దావానలభక్షణునకుఁ
బావనచరితునకు, భువన ♦ పరిపాలునకున్. 13

క. గోపవధూప్రియతమునకు
గోపకవరదునకు, వేణు ♦ గోపాలునకున్
గోపార్భకహితవరునకు
గోపాధిపసుతున కిడుదు ♦ గురుభక్తిఁ గృతిన్. 14



# కథాప్రారంభము



క. సరయూనదీతటంబున
వరకోసలదేశమందు ♦ వర్ణిత మగుచుఁ
బరిహాసితామరపురమై
ధరణి నయోధ్యాపురంబు ♦ దనరుచు నుండుఁ. 15

క. మనురాజనిర్మితంబై
ఘననాథుపురమ్ము మించి ♦ ధనసంపదలఁ,
దినకరవంశమహీశుల
కనవరతము రాజధాని ♦ యై విలసిల్లుఁ. 16

చ. పరనృపదుర్జయం బగుచు♦భాసిలునానగరోత్తమంబునన్
గరుడపతాకముల్మణులఁ♦గ్రాలు నభంబునఁ దారలో యన
న్సురుచిరవారిపూర్ణముగ ♦ శోభిలు కందక మబ్ధితుల్యమై
వరుణపురంబుచందె నను♦భ్రాంతిని గూర్చు దిదృక్షుకోటికిన్

చ. దినకరవంశభూవరుల♦ధీభుజవిక్రమసాహసంబు న
య్యనుపమసత్యసంధతయు♦నాశ్రితరక్షణతత్పరత్వమున్
వినుతజితేంద్రియత్వమును♦వేడ్క సురాళికిఁ జాటనేఁగెనో!
యన దివి నంటుసాలములు♦హాటకగోపురవప్రరాజముల్

చ. లలితవిశాలవీధులు ఫ ♦ లద్రుమసంతతి రెండువైపులం
దలరఁగఁ జల్లనై మిగుల♦హాయిని బాంధుల కిచ్చు నెప్పుడుఁ
జెలజెల రాలుదివ్యసుమ♦ సౌరభముల్ మలయానిలంబులఁ
గలయుచు వీచుచు న్గడుసు♦ఖంబునొసంగు వనంబులచ్చటఁ

సీ. భాసురవజ్రసో ♦ పానపంక్తులతోడఁ,
గమనీయమణికవా ♦ టములతోడఁ,
గీలితహరినీల ♦ జాలకంబులతోడఁ,
బచ్చలతోరణ ♦ ప్రతతితోడ,
మరకతమౌక్తిక ♦ మండపంబులతోడ,
నలరారు భవ్యసౌ ♦ ధాళితోడ,
ధనరత్నకాంచన ♦ ధాన్యరాసులతోడ,
రాజిల్లువిపణిమా ♦ ర్గములతోడ,
తే. గీ. విమలజలపూర్ణపద్మాక ♦ రములతోడఁ,
గామధేనుసమాన గో ♦ గణముతోడ,
నలఘుమాణిక్యరథనిచ ♦ యములతోడ,
నచలసన్నిభగజనివ ♦ హములతోడఁ,
జారుసుందరశ్వేతాశ్వ ♦ చయముతోడ. 20
తే. గీ. బాహుబలయుతు లగుశూర ♦ భటులతోడ,
నయవిశారదమంత్రిబృం ♦ దంబుతోడ,
వేదవిదు లగుభూసుర ♦ వితతితోడ,
ధర్మరతు లగుక్షత్రియో ♦ త్తములతోడ, 21
తే. గీ. కలిమి నలరారువైశ్యపుం ♦ గవులతోడ,
సాధుమానస మగుశూద్ర ♦ జనముతోడ,
సరసపద్గుణసుందరీ ♦ సమితితోడఁ,
గరము భాసిలుచుండు న ♦ ప్పురవరంబు. 22
తే. గీ. యోజనద్వాదశంబున ♦ నొప్పుదీర్ఘ
మునఁ, ద్రియోజనవైశాల్య ♦ మునఁదనరుచు

భాగ్యముల కెల్ల నెల్లయా ♦ పట్టణమును
న్యాయమతి నేలుచుండు న ♦ జాత్మజుండు. 23

సీ. ఆరాజు సంపద ♦ నలకాధిపుని బోలు
నతులధీరత హాట ♦ కాద్రిఁ బోలు
వసుధాభరక్షమఁ ♦ బన్నగేంద్రుని బోలు
ఘన తేజమునఁ బ్రభా ♦ కరుని బోలు
నలఘుశౌర్యంబున ♦ నమరనాథుని బోలు
గురునీతి నిర్జర ♦ గురుని బోలు
ధర్మప్రియంబున ♦ ధర్మదేవతఁ బోలు
దాతృత్వమున బలి ♦ దైత్యుఁ బోలు

తే. గీ. దుష్టజనశిక్షణంబు వి ♦ శిష్టరక్ష
ణంబు నేమరఁ డెన్నఁడు ♦ నయవిదుండు
నఖిలదిక్కుల నప్రతి ♦ హతరథుండు
సార్థకాఖ్యుండు దశరథ ♦ క్ష్మాధవుండు. 24

సీ. క్ష్మాతలేంద్రునకుఁ గా ♦ సల్యాసుమిత్రలుం
గైకాభిధానయుఁ ♦ గలరు సతులు
ఆపతివ్రతలతో ♦ నానంద మొందుచు
సంతానహీనతఁ ♦ జింత నొంది,
అఱువదివేలహా ♦ యనములు గడువ స
న్మునులయనుజ్ఞఁ గై ♦ కొని, ముదమున
ధరణీశుఁ డశ్వమే ♦ ధముఁ, బుత్రకామేష్టి
నొనరింప, నత్తఱి ♦ దనుజవిభుఁడు

తే. గీ. రావణాఖ్యుండు బ్రహ్మవ ♦ రమునఁ బ్రబలి
దేవగణముల, నరుల బా ♦ ధించుచుండ
సురలు భీతిల్లి, యచ్యుతు ♦ శరణుఁ జొచ్చి
భక్తి వందనము లొనర్చి ♦ ప్రస్తుతించి. 25

మత్త. శ్రీరమాసహితాయ, నిర్జరసేవితాయ, నమో! నమో!
చారుహాసముఖాయ, సద్గుణ నాగరాయ, నమో! నమో!
వారణాధిపరక్షణాయ, శుభప్రదాయ, నమో! నమో!
సూరివర్యనుతాయ, చంద్రియశోధరాయ, నమో! నమో!

చ. ధరణిని హేమనేత్రుఁ డురు♦దర్పముమీఱఁగఁ జుట్టి చాప
శరధినిఁజొచ్చినన్ గనలి♦శౌర్యముభాసిలఁ గ్రోడమూర్తివై గా
మర మొనరించి, దానవుని♦ద్రుంచి, మహీవలయంబు నెత్తి, ము
న్బరమముదం బొసంగవె! కృ♦పారసపూరితమానసాంబుజా!

చ. దనుజవిభుండు నందనుని♦దారుణబాధలనొందఁ జేయఁగా
'వనజదళాక్ష! యోసుజన♦వత్సల! దీనుఁడఁ, గావవే' యటం
చును నినువేఁడ నాఖలుని♦జోద్యపురూపునఁ ద్రుంచి, బాలకున్
జనవున నేలి, యెల్లరకు♦సౌఖ్యముఁ గూర్పవె! తొల్లి కేశవా!"

తే. గీ. అని నుతించుచు శ్రమముల ♦ హరికిఁ దెలుప
నార్తరక్షణతత్పరుం ♦ డాదరమున
"భూతలంబున దశరథ ♦ భూవరేణ్యు
గర్భమునఁ బుట్టి, రావణు ♦ గర్వ మడఁతు. 29

సీ. మీ యంశముల నింక ♦ మేదినీతలమున
వీరులఁ బెక్కండ్ర ♦ వృక్షచరులఁ

బుట్టింపు॥” డనుచు న ♦ ప్పురుషోత్తముం డాన
తీయు సంతోషించి ♦ యెల్లసురలు
శ్రీరమావరున కా ♦ శ్రితజనవరదున
కతిభక్తిఁ బ్రణమిల్లి ♦ యరిగి పిదపఁ
దమయంశముల నిలఁ ♦ దరుచరానీకముఁ
బుట్టించి, రంత నా ♦ భూవరునకుఁ
తే. గీ. బావకుఁడు ప్రేమ విప్రరూ ♦ పమున వచ్చి
పసిఁడిగిండియతో నిచ్చెఁ ♦ బాయసమును ;
దాని నారాజు నిజతలో ♦ దరుల కొసఁగ
నారగించిరి వారలు ♦ హర్షమెసఁగ. 30

సీ. కాంతలు ముగ్గురు ♦ గర్భముల్ దాల్చిరి
మనమున నుప్పొంగె ♦ మనుజవిభుఁడు
నవమాసములు నిండె ♦ నారీత్రయమునకు
సుతు లుదయించిరి ♦ శుభదినములఁ
జక్రి జన్మమునొంద ♦ సకలలోకంబులు
హర్షించె నంత న ♦ య్యవనివిభుఁడు
ప్రేమాంతరంగుఁడై ♦ “ రామభరతలక్ష్మ
ణాఖ్యశత్రుఘ్నులు ” ♦ నని సుతులకు
తే. గీ. నామకరణముఁ జేసె జ ♦ నతతి పొగడ
దానములఁ దృప్తినొందుచు ♦ ధరణిసురులు
బాలురకుఁ బ్రియమార దీ ♦ వన లొసఁగిరి
తల్లు లనురాగమునఁ బెంచి ♦ రుల్ల మలర. 31

సీ. అర్కప్రకాశులై ♦ యా రాజపుత్రులు
మహి ననుదినవర్ధ ♦ మాను లగుచు,
నన్యోన్యవాత్సల్య ♦ మలర సహోదరు
లాటలాడుచు సుజ ♦ నాళి వొగడ,
సుగుణగణంబుచే ♦ శోభిల్లి, విధ్యుక్త
సంస్కారములు వొంది ♦ జగమునఁగల
సకలశాస్త్రంబులు, ♦ సాము, ధనుర్వేద
మశ్వగజారోహ ♦ ణాదిరాజ

తే. గీ. విద్యలను నేర్చి, గురుభక్తి ♦ వెలసి, ధర్మ
నిరతులై సంచరింపఁగ ♦ నిజకుమార
వరులఁ గాంచుచు ద్వాదశ ♦ వత్సరములు
పరమముదమునఁ గడపె న ♦ ప్పార్థివుండు. 32

సీ. జనవిభుం డొకనాఁడు ♦ సభ నుండ 'నాకార
మూని వెల్గెడుశ్రుతి ♦ యో!' యనంగ
నలరుతపోధనుఁ ♦ డైనవిశ్వామిత్రుఁ
డరుదేర దశరథుం ♦ డమలభక్తి
నర్ఘ్యపాద్యాదుల ♦ నర్పించి, యుచితాస
నాసీనుఁ జేసి "సం ♦ యమివరేణ్యా !
భవదీయపదరజ ♦ స్స్పర్శంబువలన మా
కలుషజాలము లెల్లఁ ♦ దొలఁగె నేఁడు.

తే. గీ. మీరు విచ్చేయ నెయ్యది ♦ కారణంబు ?
కృప నెఱింగింపవే! భవ ♦ దీప్సితార్థ

మనఘ ! యిచ్చెద నిపుడు రా ♦ జ్యంబునైన ”
ననుచుఁ బ్రార్థింప గాధేయుఁ ♦ డాత్మ నలరి. 33

ఉ. “ధారణినాథ! నీయలఘు ♦ ధర్మగుణంబులు, సూర్యవంశవి
స్తారయశం బెఱుంగుటను ♦ జయ్యనవచ్చితి, నాదుయజ్ఞమున్
సారెకు దానవుల్ సెఱుప ♦ జన్నముఁగావభవత్ప్రియాత్మజు
న్మారిపరాక్రమున్ భువన ♦ మోహనుశ్రీరఘురామునంపవే.

క. మారీచసుబాహుల నీ
గారాముసుతుండు గెల్చి ♦ ఘనయశ మొందున్
భూరమణ ! నిక్క మిది, నా
కోరిక నెరవేర్పు ! మీకుఁ ♦ గూర్తు శుభంబుల్. 35

చ. తనయుఁడుఘోర దానవుల ♦ ధాటికినోర్వఁగఁజాలఁడంచునీ
మనమున భీతివీడు; మను ♦ మానము లేదు, జయంబునొందు ని
మ్మునిగణము,ల్వసిష్ఠుఁడును ♦ బొందుగ సత్యమటంచుఁబల్కినన్
వినుతపరాక్రమాఢ్యురఘు ♦ వీరునిబంపు నరేంద్రచంద్రమా”

తే. గీ. అనఁగఁ గౌశికుమాటల ♦ కదలి ఱేఁడు
చండమారుతనిహతవృ ♦ క్షంబుపగిదిఁ
బుడమిపై వ్రాలి, పిమ్మట ♦ మూర్ఛఁ దేఱి,
యతివరేణ్యుని గాంచి యి ♦ ట్లనియె భక్తి. 37

ఉ. ‘క్షీరకపోలు, బాలు, వర ♦ శీలు నదత్తమహాస్త్రజాలు నా
ఘోరనిశాచరాధిపులఁ ♦ గూల్ప రణంబున కెట్లుపంపుదున్?
వీరభటాళిఁ గూడిచని ♦ విక్రమ మొప్ప వధింతు దైత్యులన్
బోర ననుజ్ఞనిమ్ము! ముని ♦ పుంగవ! వేఁడెద! రాము మానవే!’

చ. అన మునిశేఖరుం డనల♦మాజ్యము వోసినఁ బ్రజ్వరిల్లు భా
తిని గను మగ్రుఁడై పలికెఁ♦'దీర్చెదఁ గార్య'మటన్నఁ దెల్పితిక్ష్మా
జనవర! సౌఖ్యముం గనుము; మృ♦షావచనుండను కీర్తి నొందు మేఁ
జని మొద యాగ మెట్లొకొ న♦సాగక యాగునె? యింత మాత్ర నే

తే. గీ. ఇట్లు ముని యాగ్రహింప మ ♦ హీకళత్రుఁ
డతిభయము నొంది, బాలకు ♦ నంపలేక
కీడు వాటిల్లు ననుచు దుః ♦ ఖించుచుండ
క్షితిపతిని గాంచి పలికె వ ♦ సిష్ఠమౌని. 40

సీ. "రాజేంద్ర! భయమేల? ♦ రాముని బంపుము
కుశికనందనుఁ డస్త్ర ♦ కోవిదుండు
దివ్యాస్త్రముల నొంది ♦ దివిజవైరులఁ ద్రుంచి
నీసుతుఁ డరుదెంచు ♦ నిజము, రాము
నంపవేనియు మౌని ♦ యాగ్రహించి శపించు
నాడి తప్పిన దోష ♦ మావహిల్లు"
నని యుపదేశింప ♦ నవనీశుఁ డంతట
రామలక్ష్మణులను ♦ బ్రేమఁ బిలిచి

తే. గీ. బాహువులఁ జేర్చి, సంయమి ♦ పలుకుఁ దెలిపి,
రామ! యేఁగెదె! యనిన హ ♦ ర్షంబు నొందె
నన్నతోడనె లక్ష్మణుం ♦ డరుగఁ బూనె
నంత, యతి కప్పగించె ఱేఁ ♦ డాత్మజులను. 41

సీ. సంయమీంద్రుండు దా ♦ శరథులఁ దోడ్కొని
పరమహర్షంబునఁ ♦ బయనమొందె

కలుషవిదారిణి ♦ గంగానదిని జేరి
బల, యతిబల, యను ♦ పరమమంత్ర
రాజంబులను రఘు ♦ రాముని కుపదేశ
మొనరించెఁ గూర్మి, నా ♦ యినకులాబ్ధి
శశధరుం డమ్మంత్ర ♦ శక్తి బాలార్కుని
పగిది నొప్పుచు ఘోర ♦ వనముఁ జొచ్చి

తే. గీ. భీతి దిక్తతి కంపింప ♦ వింటినారి
మీటఁ బటుభీషణాకృతిఁ ♦ దాటకాఖ్య
కవిసి గర్జింప బ్రహ్మర్షి ♦ కరుణఁ జూచి
జయము! శ్రీరామ! జయమని ♦ స్వస్తి నొసఁగె.

సీ. అంత నిశాచరి ♦ యత్యుగ్రముగ శిలా
వర్షంబుఁ గురియింప ♦ వాడిసాయ
కంబుల వారించి ♦ కాకుత్స్థకులవీరుఁ
'డంగన' యనుచుఁ గృ♦పాళుఁ డగుచు
శిక్షించి విడువ యో ♦ చింప గాధేయుండు
'కడుఁ గ్రూరురాలిది ♦ కరుణఁజూడఁ
దగదు; వేగ వధించి ♦ ధరణీప్రజాళికి
ముదముఁగూర్పుము రాజ♦పుత్త్ర' యనియె

తే. గీ. రాక్షసాంగన దారుణా ♦ ర్భటుల రాముఁ
బొదువ నుంకింప దనుజరి ♦ పుండు తీవ్ర
శరము గుఱిపెట్టి యసురవ ♦ క్షమున విడువ
భూధరమ్ము లదర నది ♦ పుడమిఁ గూలె.

క. మునినాథుఁడు శ్రీరాముని
ఘనబాహుబలంబుఁ గాంచి, ♦ కౌతుకమతియై
దనుజేంద్రభీకరము లగు
తనదివ్యాస్త్రముల నొసఁగె ♦ దైత్యహరునకున్. 44

తే. గీ. వారి యంతట సిద్ధాశ్ర ♦ మమున కెలమి
నక్కుమారులఁ గొనిపోయి ♦ యాగదీక్షఁ
బూన, నాఁటిరేయందు ♦ దానవాళి
రక్తవర్షంబుఁ గురియింప ♦ రాదుర్రిఁ డగుచు. 45

సీ. అర్కవంశోత్తముం ♦ డానిశాచరులను
గగనమార్గంబునఁ ♦ గాంచి వేగ
ననుజుండు తోడుగా ♦ నఖిలదానవులపై
నిశితాస్త్రముల నేసి ♦ నేలఁగూల్చి
యొక్కశరమున మ ♦ హోదధిఁ బడవైచె
నీచు నమ్మారీచు ♦ నేర్పుమీఱఁ
గ్రూరకర్ము, సుబాహుఁ ♦ గుటిలు, వక్షంబున
ఘోరబాణము నేసి ♦ కూల్చె ధరణి

తే. గీ. నసురసంహారమును గని ♦ యచటిమునులు
ప్రేమతో నుతియించి ర ♦ వ్వీరవరుల
గగనమందున దివిజులా ♦ ఘనులఁ బొగడి
కుసుమవర్షంబుఁ గురిసిరి ♦ కూర్మిమీఱ. 46

తే. గీ. అంత మిథిలేశుగృహమున ♦ హరునివిల్లుఁ
జూపఁ దలఁచి మునీంద్రుఁ డా ♦ శూరవరులఁ

దోడుకొని, శోణ, గంగాన ♦ దులను గడచి
మనుజవిరహితరమ్యాశ్రి ♦ మంబు సొచ్చి. 47

క. "గౌతమునితపోవన మిది
యాతనిసతి కలుషచిత్త ♦ యై చరియింపన్
గౌతముఁ డాగ్రహమున నా
నాతిని శపియించి వెడలె ♦ నాఁడు మొదలుగన్. 48

తే. గీ. పాడువడియె నీవిపిన మా ♦ పడఁతి యిచట
నొరులదృష్టికిఁ గనరాక ♦ యుర్విఁ బండి
వాయుభక్షిణియై యుండె ♦ వనిత కిపుడు
శాపమును బాపఁగా నటఁ ♦ జనుద" మనుచు. 49

తే. గీ. రాఘవులతోడ నమ్ముని ♦ రాజు గౌత
మాశ్రమముఁ జేరఁ గరుణార ♦ సాబ్ధియైన
రాముకృప శాపమును బాసి ♦ రమణి లేచి
పరమపావను వినుతించె ♦ భక్తిమీఱ. 50

శా. ఆకర్ణాంతవిశాలనేత్రములతో ♦ నర్కప్రకాశంబుతో
రాకాచంద్రునిబోలునెమ్మొగముతో, ♦ రాజిల్లుహారాళితో,
శ్రీకారంబులఁబోలుకర్ణములతో ♦ శృంగారరూపంబుతో
నాకీవేళను గానవచ్చుకమలా ♦ నాథున్ బ్రశంసించెదన్.

ఉ. నల్లనిదేహకాంతి, రత ♦ నాలకిరీటము, హేమచేలమున్
జెల్లనిచూపులున్, గమల ♦ శార్ఙ్గగదాదరచక్రహస్తముల్
వెల్లుదయారసం బెదను ♦ బేర్వడ భక్తులఁబ్రోచునిన్ను నే
నెల్లపుడున్ ముదింపలఁచి, ♦ యేమరకే శరణంబువేఁడెదన్.

మత్త. ఎన్ని దినములనుండియో మది♦నింది రేశ! భజింప నా
కన్నులన్ నిను గాంచు భాగ్యము♦గల్గె నిట్టియెడ రాఘవా!
పన్నగాశనవాహనా! గజ♦పాలనా! మునిపోషణా!
సన్నుతాంఘ్రిసరోజ! నాకలు♦షంబుఁ దీఱిచి కావుమా!

సీ. ప్రహ్లాదరక్షక ♦ బంధవిమోచక
నిఖిలభూతాత్మక ♦ నిష్కళంక!
మధుసంహరా! యవా ♦ జ్మానసగోచరా!
యాదిమునీశ్వరు ♦ లగుసనంద
నాదులైనను నీగు ♦ ణాళి యిట్టి దటంచు
వినుతింపఁజాలరు ♦ విశ్వరూప!
అతివను ఖలచిత్తు ♦ నజ్ఞానిని నగునేఁ
గొనియాడ నేర్తునే! వనధిశయన!

తే. గీ. పరమయోగీంద్రమానస ♦ వనజమిత్ర
భానుశశినేత్ర పరమపా ♦ వనచరిత్ర!
కమలభవనుతిపాత్ర! జ ♦ గత్పవిత్ర!
రమ్యశుభగాత్ర! కోసల ♦ రాజపుత్ర! 54

క. హరి! హరి! యని యనువఁగనే
హరియింపవు జనులకలుష ♦ మనయము వారల్
దురితము లొనరింపక నిను
బరితాపంబున భజింపఁ ♦ బాపుదు వఘముల్. 55

క. ధర్మపథంబును దప్పక
నిర్మలమతులై భజించు ♦ నీభక్తాళిన్

కూర్మిని గాతువు సతతము
ధర్మప్రియ ! భక్తలోల ! ♦ దశరథపుత్త్రా ! 56

తే. గీ. సకలభూతాళియెడఁ బ్రీతి ♦ శాంతగుణము
నింకుమతి; త్యాగమును, మనో ♦ నిగ్రహంబు
ధర్మసంస్థాపనాదర ♦ త్వంబుఁ గలిగి
రక్తి నినుఁ గొల్చువారలే ♦ భక్తు లనఘ ! 57

తే. గీ. ఆగ్రహ, మతృప్తి, లోభమ ♦ దాంధతలును
స్వార్థచింతన, నిర్దయ ♦ సాధునింద
దంభగుణమును గలిగి నిన్ ♦ దలఁచునరుల
భక్తు లనఁజెల్లునే ! భువిఁ ♦ బరమపురుష ! 58

క. ధర్మమయుండవు నీ విల
ధర్మము నశియించునపుడు ♦ దైత్యాంశజులన్
ధర్మవిహీనులఁ దునుమను
ధర్మము స్థాపింపఁ దనువుఁ ♦ దాల్తువు రామా ! 59

తే. గీ. అనుచుఁ గీర్తింప గౌతముఁ ♦ డరసి వచ్చి
హర్షమలర నహల్యతో ♦ నమ్మహాను
భావులకు నర్ఘ్యపాద్యముల్ ♦ భక్తి నొసఁగ
గారవంబున వీడ్కొని ♦ వార లరిగి. 60

సీ. రమణీయసౌధముల్ ♦ రత్నగోపురములు
భూరివీథులు పచ్చ ♦ తోరణములు
సుమసారభానిల ♦ శోభితవనములు
నకలంక జలకమ ♦ లాకరములు

మాణిక్యరథములు ♦ మదవారణంబులు
సుందరాశ్వంబులు ♦ శూరభటులు
సకలశాస్త్రంబులఁ ♦ జదువుభూదివిజులు
నరిభయంకరు లగు ♦ నవనిపతులు

తే. గీ. బహుళసంపద నలరారు ♦ వైశ్యవరులు
సుగుణసంపన్నులై యొప్పు ♦ శూద్రజనులు
పతియె దైవంబుగా నెంచు ♦ పద్మముఖులు
గలిగి శోభిల్లుమిథిలాన ♦ గరవరంబు. 61

క. కనుఁగొని యానందంబున
జనకమహీనాథుకడకుఁ ♦ జన ; భూపతి యా
దినకరకులశేఖరులను
మునివర్యుని గాంచి, పరమ ♦ మోదము నొందెన్.

తే. గీ. అర్ఘ్యపాద్యాదు లొసఁగి, "యో ♦ యతివరేణ్య !
దినకరసుధాకరులవలెఁ ♦ దేజరిల్లు
నిమ్మహామహు లెవ్వరో ♦ యింపుమీఱ
నానతీయుము వినఁ గోర్కి ♦ యతిశయించె". 63

క. అని యడుగఁగ మౌనీంద్రుఁడు
"మనుజాధిప ! వినుము వీరు ♦ మనువంశభవుల్
దనుజులఁ బోరిగొని, పురహరు
ధనువును జూడంగ నిటకు ♦ దయచేసి" రనన్. 64

సీ. క్షితినాథుఁ డిట్లు వ ♦ చించె నమ్మౌనితో
"మున్ను జన్నము సేయఁ ♦ బూని యేను

బుడమి దున్నుచునుండ, ♦ భూమియం దొకబాలి
కామణి కన్పింపఁ ♦ గడుఁ బ్రియమున
సీతాభిధానంబు ♦ నేసి, యాబాలను
బోషించి పిదప మా ♦ పూర్వుఁడైన
దేవరాతుండను ♦ ధీమంతునకు శివుం
డిచ్చినయావిల్లు ♦ నెక్కువెట్టు

తే. గీ. శూరవర్యున కేను గు ♦ మారి నిత్తు
నంచుఁ దెలుప మహీవల ♦ యాధిపతులు
వచ్చి, వి ల్లెత్తఁజాలక, ♦ వాంఛ వీడి
చనిరి సురలైనఁ గదలింపఁ ♦ జాల రనుచు. 65

తే. గీ. బలియు రగునైదువేవురు ♦ భటులఁ బంప
దేవగృహమునఁ బూజించు ♦ దివ్యధనువు
నచటి కాయసమంజూష ♦ నలరఁ దెచ్చి
ఛూపి రాసభ నెల్లరుఁ ♦ జోద్య మొంద. 66

క. రాముఁడు దనుజవిరాముం
డామౌనియనుజ్ఞ నొంది, ♦ హర్షాన్వితుఁడై
కోమలహస్తముతో నా
భీమునివి ల్లెక్కువెట్టఁ ♦ బెళపెళ విఱిగెన్. 67

క. పురహరుచాపము విఱుఁగఁగ
వరఘోషము కలిగె నపుడు ♦ వసుధ వడంకెన్
ధరణీధరములు కదలెను
నరు లెల్లరు భీతులైరి ♦ నాఁ డాసభలోన్. 68

సీ. ఇంద్రనీలచ్ఛాయ ♦ నెసఁగుదేహమువాని,
సిరి కాటపట్టైన ♦ యురమువానిఁ,
బుండరీకంబులఁ ♦ బోలుకన్నులవానిఁ,
జంద్రమండలనిభా ♦ స్యంబువానిఁ,
గమనీయనవపీత ♦ కనకచేలమువాని,
నూర్ధ్వపుండ్రంబుల ♦ నొప్పువాని,
వైడూర్యమణియుత ♦ వరకిరీటమువాని,
రమణీయరత్నహా ♦ రములవాని,
తే. గీ. జనకసుత గాంచి హర్షించె ♦ స్వాంతమందు
"నాయభీష్ట మీడేరె నీ ♦ నాఁటి" కనుచు
జనకభూపతి కడుసంత ♦ సమునఁ బొంగి
వేదవంద్యుఁ బరాత్పరు ♦ వినుతిఁ జేసె. 69

తే. గీ. అంత మిథిలేశుఁ డీశుభో ♦ దంత మెల్ల
దశరథునకు నెఱింగించి ♦ "త్వరితముగను
దోడుకొని రం"డటంచు మం ♦ త్రులను బంప
ధరణిధవుఁ డరుదెంచె నె ♦ ల్లరను గూడి. 70

సీ. జనకభూమీశుండు ♦ సంతోషమున నెదు
రేఁగి తోడ్తెచ్చెఁ దా ♦ నినకులేశు
దశరథభూపతి ♦ తనయులఁ గనుగొని
యానందమునఁ బొంగి ♦ యతివరేణ్యు
వినుతించె నంతట ♦ విబుధు లేర్పఱచిన
శుభదినంబున సీత ♦ సుజనవినుత

నారామునకు నమ ♦ లాత్మఁడౌ సౌమిత్రి
కూర్మిళ యనుతన ♦ కూర్మిసుతను

తే. గీ. దనసహోదరుతనయల ♦ ధన్యమతుల
మాండవీశ్రుతకీర్తుల ♦ నిండువేడ్క
భరతశత్రుఘ్నులకు నిచ్చి ♦ పరిణయములు
వసుమతీధవుఁ డొనరించె ♦ వైభవముగ. 71

తే. గీ. మంగళధ్వానములు మహి ♦ మాఱుమ్రోసె
వేదఘోషంబు మిన్నంటె ♦ విప్రవరులు
దంపతులదీవనలతోడఁ ♦ దనిపి చనిరి
దానములఁ దృప్తి నంది రా ♦ ధరణిజనులు. 72

తే. గీ. దశరథాత్మజులకుఁ దన ♦ తనయలకును
నవనిధవుఁ డిచ్చెఁ బ్రీతి ది ♦ వ్యాంబరముల,
రత్నభూషణ, గజ, వాజి ♦ రథగణముల
దాసదాసీజనంబులఁ ♦ దగినరీతి. 73

తే. గీ. అమ్మహోత్సవ మీరీతి ♦ నైనపిదపఁ
గూర్మితోఁ గౌశికుఁడు రఘు ♦ కుంజరులను
జనకరాజేంద్రు వీడ్కొని ♦ చనియె విపిన
భూములకు ; నంతఁ గోసల ♦ భూవరుఁడును. 74

క. జనకమహీశుని వీడ్కొని
వనితారత్నములఁ గూడి, ♦ వరపుత్రులు రాఁ
దనరాజ్యమునకు వెడలెను
మనమున ముదమలర ; నంత ♦ మార్గమునడుమన్.

క. ముని యగు భార్గవ రాముఁడు
జననాథుం డైన రాము ♦ శౌర్యముఁ జూడన్
ఘనకౌతుక మొప్పఁగ నా
తని కడ్డము వచ్చి, నిలిచి, ♦ తగ నిట్లనియెన్. 76

క. "హరుచాపము విఱిచితి వని
పరమాశ్చర్యముగఁ బ్రజలు ♦ ప్రస్తుతిఁ జేయన్
ధరణిని విని వచ్చితి నీ
హరిచాపము నెక్కువెట్టు ♦ మవనీశసుతా! 77

ఆ. వె. శివునిధనువుకంటె ♦ శ్రేష్ఠము నాచాప
మసురవైరిదత్త ♦ మధిప! దీని
నెక్కువెట్టి చూపు ♦ మిపుడు నీభుజవీర్య"
మనఁగ భీతుఁడయ్యె ♦ నజసుతుండు. 78

సీ. పరశురామునిశూర ♦ భాషణంబుల కాగ్ర
హించి శ్రీరాముఁ డా ♦ శ్రీశుధనువు,
నవలీల నాతని ♦ హస్తమునుండి కై
కొని యెక్కువెట్టి, యో♦మునివతంస!
నిను వధించిన దోష ♦ మని జంకుచున్నాఁడ
వైష్ణవశర మిది ♦ వ్యర్థముగను
మరలదు గాన నీ ♦ చరణద్వయంబును
దెగటార్తు ననఁగ ని ♦ స్తేజుఁడగుచు

తే. గీ. భార్గవుఁడు వల్కె నీరీతిఁ ♦ "బార్థివేంద్ర!
చరణయుగము ఖండించిన ♦ సంచరింపఁ

జాల ; నాపుణ్యలోకముల్ ♦ గూలనేయు ”
మనఁగ నారీతిఁ గావించె ♦ నర్కకులుఁడు. 79

మ. “అనఘా! నీవు మదీయచాపము ననా♦యాసంబుగా నెత్తఁ
ఘనచక్రాయుధపాణి విట్లు ధరణిన్ ♦ గాపాడ జన్మించి తీగన్
వని నే మానసమం దెఱింగితిని, కం♦జాక్షా! రమానాథ! నే
డనిలో నీవిజయంబుఁజూడ మది నా♦కానందమే భూవరా!”

తే. గీ. అనుచు రఘుకుంజరునకు వం ♦ దన మొనర్చి
పరశురాముఁడు వెడల నె ♦ ల్లరు ముదమునఁ
బురముఁ జేరఁగ నవ్వధూ ♦ వరుల కెలమిఁ
బౌరు లొసఁగిరి కర్పూర ♦ హారతులను. 81

తే. గీ. సకలమంగళవాద్యఘో ♦ షంబు లెసఁగ
క్షితిసురోత్తమచయము లా ♦ శీర్వదింప
రాజవదనలతోడ నా ♦ రాజసుతులు
రత్నసౌధముల్ సొచ్చిరి ♦ రాజితముగ. 82

తే. గీ. రామలను గూడి వనవిహా ♦ రముల వారు
కౌతుకంబునఁ గాలంబుఁ ♦ గడపుచుండఁ
గేకయాధీశ్వరునికోర్కి ♦ క్షితితలేంద్రుఁ
డంపె భరతు ననుజు బాంధ ♦ వాళిఁజూడ. 83

క. రాముఁడు త్రిగుణాతీతుఁడు
భూమిని బ్రజ లెపుడుఁ దన్నుఁ ♦ బొగడుచు నుండన్
భూమిజయును లక్ష్మణుఁడును
బ్రేమ నిరంతరముఁ గొలువ ♦ వేడుక నుండెన్. 84

కం. కాళిందీనిర్మలజల
కేళీసంతతవిలోల ! ♦ కీర్తివిశాలా !
లాలితకాంచనచేలా !
పాలితగోపాలబాల ! ♦ పావనశీలా ! 55

—* గ ద్య ము *—

ఇది శ్రీమద్గుంటూరుపురఖేల వేణుగోపాల వరప్రసాదలబ్ధ
కవిత్వ శాండిల్యసగోత్ర మాచిరాజు సౌభాగ్యలక్ష్మ్యం
బికా సుబ్బరాయామాత్యతనూజ, కౌండిన్యసగోత్ర
దేచిరాజు శేషాంబారామచంద్రరాయతనూభవ
రామరాయాఖ్య ధర్మపత్నీ లక్ష్మీనరసమ్మ
నామ్నీ విరచితం బైన శ్రీరామచరిత్రం
బనునిర్వచనకావ్యంబున
బాలకాండము.

శ్రీః

శ్రీమద్వేణుగోపాలస్వామినే నమః



# శ్రీరామచరిత్రము



## అయోధ్యాకాండము





కమలాసనపురహర
నాకాధిపచిత్తసాధ్య! ♦ నగజారాధ్యా!
రాకాశశాంకవదనా!
శ్రీకర గుంటూరుసదన! ♦ సింధురగమనా!

సీ. అవ్విధంబున ద్వాద ♦ శాబ్దముల్ గడువ, భూ
పతి నిజమృతిని దు ♦ స్స్వప్నములను
దెలియుచు నిట్లు చిం ♦ తించె " నగ్రతనూజుఁ
బితృభక్తితత్పరుఁ ♦ బ్రేమపాత్రుఁ

బట్టమహిషిసూనుఁ ♦ బరమసద్గుణగణున్
విభుని జేయుట జనా ♦ భీష్ట మరయ
నదియె ధర్మము, మదీ ♦ యాత్మకు మోదంబు ;
నైనఁ గైకతనూజు ♦ నధిపుఁ జేయఁ

తే. గీ. బరిణయమునాఁడు కేకయ ♦ పతికి వరము
నిచ్చితిని గాన, నెట్లు మ ♦ హీశు, రాముఁ
జేయఁజాలుదు ? ; నిమ్మేన ♦ జీవ మలరఁ ;
గాల మాసన్న మయ్యె ని ♦ క్కముగ నాకు. 2

తే. గీ. కైక శ్రీరాము ననయంబుఁ ♦ గరుణఁ జూచు
ధర్మనిరతుఁడు భరతుఁ డీ ♦ ధాత్రిఁ గోరఁ
డైన నాతఁడు రాకము ♦ న్నధిపు రాముఁ
జేయుటయె మే" లనుచు జేఁడు ♦ శీఘ్రముగను. 3

సీ. పని గలదంచు భూ ♦ ప్రజల సామంతులఁ
బిలిపించి సంశయ ♦ కలితుఁ డగుచు
జనక కేకయమహీ ♦ శ్వరులకుఁ దెల్పక
సభఁ దీర్చి పలికె హా ♦ ర్షంబు గదుర
"నలువదివేలహా ♦ యనములు గడచె నే
నధికవృద్ధుఁడఁ గాన ♦ నవనిభరముఁ
దాల్పనోపక యగ్ర ♦ తనయుఁ, గల్యాణగు
ణాకరు, యావరా ♦ జ్యాభిషిక్తుఁ

తే. గీ. జేయుదును మీయభీష్టముల్ ♦ సెప్పుఁ" డనఁగ
నీరదధ్వని కలరుమ ♦ యూరచయము

భాతి నెల్లరు నుప్పొంగి ♦ పలికి రిట్లు
"విభు నొనర్పుము ! శ్రీరాము ♦ వేగ నధిప ! 4

సీ. శాంతదయాసత్య ♦ శౌచధర్మంబుల
నాపదలందుఁ బా ♦ యనిమహాత్ముఁ
డోకయుపకృతిఁ జేయ ♦ నుంచు మది న్నిత్య,
మపకారశతముల ♦ నాత్మ నెన్నఁ
డార్జించు సతము దర్వ ♦ వ్యమును న్యాయంబుగఁ
బాత్రుల కొసఁగును ♦ బరమకరుణఁ
బ్రజలసౌఖ్యంబునే ♦ భావమందునఁ గోరు
సకలశాస్త్రవిదుండు ♦ శౌర్యధనుఁడు

తే. గీ. దుష్టశిక్షణ మొనరించు ♦ దోర్బలుండు
వైరిసుగుణంబుఁ గైకొను ♦ భవ్యశీలుఁ
డార్తరక్షణతత్పరుం ♦ డమలయశుఁడు
మృదుసుభాషణుఁ డలఘుజి ♦ తేంద్రియుండు. 5

తే. గీ. శ్రీరఘూత్తము, నవనిజా ♦ చిత్తధాము,
వరగజారూఢు, స్మితముఖ ♦ పంకజమును
వెల్లపట్టుగొడుగునీడ ♦ నెల్లరమును
జూడఁగోరుదు" మన నుబ్బి ♦ క్షోణిధవుఁడు. 6

ఆ. వె. "ఎల్లి శుభముహూర్త ♦ మెల్లవారలు సూడ
రామచంద్రుని యువ ♦ రాజొనర్తుఁ
బుర మలంకరింప ♦ ముదమునఁ జాటింపుఁ"
డనుచు నాజ్ఞ నొసఁగి ♦ యవిభుండు. 7

సీ. రాముని బిలిపించి, ♦ ప్రేమమై నాలింగ
నముఁ జేసి "నాయనా! ♦ నాయనుంగుఁ
బుత్త్రికా! నే నింక ♦ భూమిని బాలింపఁ
జాలను నిన్నెల్లి ♦ సత్వరముగ
యువరాజుఁ జేయుదు ♦ నుర్వీభరముఁ దాల్పు
నుర్వీసుతయు నీవు ♦ నుపవసింపుఁ"
డని చెప్పి యొప్పించె, ♦ నంత నీశుభవార్తఁ
బౌరు లాకర్ణించి ♦ పట్టణమున

తే. గీ. హర్షకోలాహలము సేయ ♦ నాలకించి
మంథరాఖ్యాత యొకదాసి ♦ మాయలాఁడి
కటకటంబడి యావార్తఁ ♦ గైకతోడఁ
దెలుపుటకు బిఱబిఱఁ జని ♦ పలికె నిట్లు. 8

తే. గీ. "అక్కటక్కట! నీ కిప్పు ♦ డవనినాథుఁ
డెంతద్రోహముఁ జేసెనో ♦ యెఱుఁగ కివు
సంతసించుచు నున్నావు ♦ క్ష్మాతలేశుఁ
జేయు రేపట శ్రీరాముఁ ♦ జెలియ! వింటె?" 9

ఆ. వె. అనఁగ దానిమాట ♦ లాలించి కైకేయి
"రాము, సుగుణధాము, ♦ రాజుఁ జేయఁ
బరమహర్ష మగును ♦ భయమేల? రాముఁడు
భక్తిఁ జూచు నన్ను ♦ భరతుకంటె". 10

సీ. అని మందహాసాంచి ♦ తాస్యయై వచియింప
నద్దాసి యిట్లనె ♦ "నమ్మ! వినుము

సార్వభౌమునికూర్మి ♦ సతివి నీ వగుట నా
కౌసల్య నెన్నఁడు ♦ గారవింప
వకారణంబున ♦ నామె నీపై నింకఁ
గాఠిన్యము వహించుఁ♦గాదె! చెలియ!
రాజైనపిమ్మట ♦ రాముఁడు గర్వియై
భరతుని, నిన్నును ♦ బాధవెట్టు

ఆ. వె. చిత్తవృత్తి నెఱిఁగి ♦ సేవింపనేర వీ
వారులఁ, గాన నిప్పు ♦ డుర్వినాథుఁ
దగినరీతి నడుగు ♦ ధరణీతలాధిపు
భరతుఁ జేయఁదగిన ♦ తరుణ మిదియె. 11

సీ. దేవాసురులు పోర ♦ దివిజపక్షంబునఁ
బుడమిఱేఁ డనిసేసి ♦ మూర్ఛిలంగ
నీవు కాపాడ భూ ♦ నేత ప్రియంబున
వరము లిచ్చెను గాన ♦ వసుమతీశు
నవ్వరద్వయము నేఁ ♦ డడుగు ; మం దొకటి
భరతుని వసుమతీ ♦ పతిని జేయ,
రాముని గాంతార ♦ భూమి కంపుట, రెండు
వరములఁగోరుము ;♦భరతుఁ డిపుడు

తే. గీ. దూరదేశమునం దున్న ♦ కారణమునఁ
బ్రేమ మెండయ్యెఁ బ్రజలకు ♦ రామునందు
నతని నడవుల కంపక ♦ యధిపు భరతుఁ
జేయఁ గొలువరు భక్తి నీ ♦ క్షితిజనంబు. 12

తే. గీ. తల్లి! యువ్వర మొకటి వ్య ♦ ర్థంబు గాన
ముఖ్యముగఁ గోరుమీ వన ♦ ములకుఁ బంపఁ
బ్రాణములతోడ రాముఁడు ♦ వచ్చునేని
భుక్తరాజ్యంబు నెవ్విధిఁ ♦ బొందఁగలఁడు ? 13

తే. గీ. రాము నెడఁబాపఁ, బ్రజలకుఁ ♦ బ్రేమ కలుగు
భరతుపై " నంచుఁ దెలుప మం ♦ థరను గైక
గారవించుచు ఘనరాజ్య ♦ కాంక్ష నొంది
క్షితిని బొరలుచు మిగుల దుః ♦ ఖించుచుండె. 14

తే. గీ. మాధవుఁడు రాత్రి యరుదెంచి ♦ కైకఁ గాంచి
కామవివశత బ్రతిమాలెఁ ♦ " గాంత ! యిట్లు
కుందనేటికిఁ ? దెలుపు, నీ ♦ కోర్కెఁ దీర్తు
నెద్దియైన నొసంగెద ♦ నింపుమీఱ
రామునాన " యనంగ నా ♦ రమణి వలికె. 15

సీ. " ధరణీశ ! నీ వాడి ♦ తప్పవు గాన ము
న్ననిఁ గావ నా కొసం ♦ గినవరద్వ
యంబును నే నిపు ♦ డడిగితి, నొసఁగుము
నాతనూజుని మహీ ♦ నాథుఁ జేసి
పదునాలుగబ్దముల్ ♦ పంపవలయు రాముఁ
దాపసవృత్తిఁ గాం ♦ తారములకు
నీ రెండువరముల ♦ నిమ్మ"ని కోరఁగ
హా! యని మూర్ఛిల్లి ♦ యవ్విభుండు

తే. గీ. కొంతవడికిని దెలివొంది ♦ " కుటిలచిత్త !
యింతదుర్మార్గురాల వం ♦ చెఱుఁగ కపుడు

పామునకుఁ బాలువోసిన ♦ పగిది నీకు
నధికదయఁ జూపి వరమీయ ♦ హాని కలిగె. 16

సీ. రాముని బంప నా ♦ ప్రాణంబు నిలువదు
సత్యంబు, మఱియు నా ♦ సాధుశీలుఁ
డనయంబు నిను నిజ ♦ జననికంటెను గడు
భక్తిని సేవించుఁ, ♦ బరమమైత్రిఁ
భరతుని జూచు, నా ♦ భానుకులోత్తము
నడవుల కంప ని ♦ న్నట్లు భక్తిఁ
గొలుచువాం డెవరు ? నీ ♦ కొడుకు ధర్మరతుండు
పుడమిఁ బాలింప నొ♦ల్లఁ డిది నమ్ము;

తే. గీ. మేమిలాభంబు నొందెదీ ♦ వివ్వరములఁ ?
గాన నివి గాక కోరుము ♦ కాంక్ష దీఱ
నెవ్వియైన నొసంగెద ♦ నిఃపుమీఱఁ
గపటమును వీడి నన్నేలు ♦ కరుణఁబూని. " 17

సీ. అని వేఁడఁ గైకేయి ♦ ' యవనీశ ! నా కిఁక
నేవరంబును వల ♦ దిట్లు సేయ
నిచ్ఛగింపవయేని ♦ యే నిఁక జీవింప
నోపను నీవె యా ♦ యుర్వినుండి
సత్యవ్రతుం డను ♦ సత్కీర్తి నొందు' మ
టంచు నిష్ఠురముల ♦ నాడ నధిపుఁ
" డేమైనవరముల ♦ నిత్తు " నే నన మున్ను
మాని నేఁ డిటు క్రూర♦మూని యడిగె

తే. గీ. ననుచు దుఃఖాగ్నితప్తుఁడై ♦ యట్టిసూను
నడవి కెట్లంపఁగల ? నని ♦ యడలి యడలి
సత్యహానిఁ దలఁచి, మన ♦ శ్శాంతి లేక
యతిశయవ్యథ నారాత్రి ♦ నచటఁ గడపె. 18

క. తనకులజుఁ డైనరాముని
మునివంద్యుని రాజు సేయ ♦ మోదముతోఁ దా
నును జూడ వచ్చెనో యన
దినకరుఁ డుదయించె నపుడు ♦ దిశలు వెలుంగన్.

ఉ. అంతట మానులు న్సచివు
లాప్తులు భృత్యులు పౌరవర్గసా
మంతనృపుల్ ధరాసురులు
హర్షముతో సభ కేఁగి, జానకీ
కాంతును హూత్సవంబుఁ గను
కాంతు వసింప, వసిష్ఠమౌని "భూ
కాంతుఁ డిదేలకో తడసెఁ,
గార్యముహూర్తము డాసెఁ, గావునన్.

తే. గీ. సచివశేఖర ! నీ వేఁగి ♦ సత్వరముగ
నవనివల్లభుఁ దోడితె " ♦ మ్మని వచింప
మంత్రిసత్తముఁ డగునాసు ♦ మంత్రుఁ డేఁగి
తపసియానతిఁ దెలిపె నా ♦ ధరణిపతికి. 21

సీ. మంత్రిశేఖరునితోఁ ♦ మాటాడ నేరక
ధరణిని బడియుండె ♦ దశరథుండు

"రాము నిటకు నీవు ♦ రయమునఁ దోడ్కొని
రమ్మ"ని చెప్పె నా♦రమణి యపుడు
సచివుఁడు చని వేగ ♦ జననియానతిఁ దెల్ప
రాముఁ డేతెంచి భూ ♦ రమణుఁజూచి
'తల్లి! జనకుఁ డిట్లు ♦ ధరణి మూర్ఛిల్లఁగ
నేమికారణ?' మన ♦ నింతి యనియె

తే.గీ. 'మున్ను నా కిచ్చియుండె నీ ♦ భూవరుండు
వరయుగంబును నిపుడు నే ♦ వానిఁ గోర
వనములకు నిన్నుఁ బొమ్మని ♦ పలుకలేక
చింతనొందుచు నున్నాఁడు ♦ చిత్తమందు.' 22

క. అని వివరింపఁగ రాముఁడు
తనకరముల జనకు నెత్తి ♦ "తండ్రీ! వినుమీ!
మనమున నీమాత్రమునకె
ఘనదుఃఖము నొంద నేల? కాకుత్స్థవరా! 23

ఆ.వె. భరతుఁ డేలుఁగాక ♦ వసుధ నే నిప్పుడే
విపినములకుఁ బోదు ♦ వేడ్కతోడఁ;
జింతవీడు" మని వ ♦ చింపఁ గుమారు న
వ్విభుఁడు కౌఁగిలించి ♦ ప్రేమ మీఱ. 24

సీ. అడలుచు 'హా! రామ! ♦ హా! సుగుణస్తోమ!
యినకులార్ణవసోమ! ♦ యిద్దురాత్మ
రాలికి మున్ను వ ♦ రద్వయం బొసఁగిన
ఘనదోషమున దుఃఖ ♦ వనధిఁ గూలి

ధర్మబద్ధుండనై ♦ తనయ ! నిన్నిడుమల
పాలుసేసితి వన ♦ వాసమునకు
నీ వేఁగవలవ దీ ♦ నిర్దయు నెదిరించి
రాజ్యంబు గొను'మన♦రాముఁ డనియె

తే. గీ. 'తండ్రి ! నిను నిరసింతునే ♦ ధరణిఁగోఱకు
సత్యహీనుని నినుఁజేసి ♦ స్వర్గరాజ్య
పదవినైనను గోర భూ ♦ పాలచంద్ర !
గహనవాసంబు సుఖముగఁ ♦ గడపి వత్తు.' 25

క. అని యూరడించి పిమ్మట
జననీగేహమున కేఁగి ♦ జనయిత్రికి న
వ్వనగమనవార్త దెలుపఁగ
ఘనశోకంబున వచించెఁ ♦ గాంత సుతునితోఁ. 26

సీ. "హా సుకుమార ! నా ♦ యనుఁగుఁ గుమార! నే
ము న్ననేకవ్రత ♦ముల నొనర్చి
కనుట ని న్నీరీతిఁ ♦ గాననంబుల పాలు
సేయుట కయ్యెఁగా ! ♦ క్షితిధవునకుఁ
బ్రేమ నాయెడ లేదు ♦ రామ ! నీసుగుణాళి
మెచ్చుటఁ బతి సేయ ♦ నిచ్చగించెఁ
గైకతనూజుఁడే ♦ ధాత్రీధవుం డగుఁగాక !
ఘోరాటవుల కిట్లు ♦ కూర్మి వీడి

తే. గీ. యనుప నేటికి నిను ? మదీ ♦ యసదనమున
బ్రతుకనీయఁగరాదె ! హా ! ♦ భానువంశ

వార్ధిచంద్రమ ! నీవెంట ♦ వత్తు" నంచుఁ
బుడమి దొరలుచు విలపింపఁ ♦ బుత్త్రుఁ డెత్తి. 27

తే. గీ. "ధరణినాథుఁడు న న్నంపఁ ♦ దలఁపఁ డమ్మ!
తండ్రిసత్యంబు నిలుపఁగఁ ♦ దలఁచి యడవి
కరుగువాఁడను సెలవిమ్ము! ♦ కరుణఁ దల్లి!
పతిని విడనాడి వత్తువే ♦ సుతునితోడ ? 28

తే. గీ. వీడఁదగునె ? ధర్మంబు సా ♦ ధ్వీమతల్లి !
గహనవాసం బొనర్చి సౌ ♦ ఖ్యముగ వత్తు"
ననుచుఁ బ్రియమాఱ జనని నూ ♦ రార్చి, సతికి
సర్వ మెఱిఁగింపఁ బ్రేమ యో ♦ పాలలామ
'వత్తు నే' ననఁ జింతించి ♦ పలికె విభుఁడు. 29

క. "క్రూరమృగాకీర్ణంబును
ఘోరాసుర వేష్టితంబు ♦ కోమలి వగునీ
వారణ్యావాస మకటా !
యేరీతిఁ సలుపనేర్తు ? ♦ విటనుండు !" మనన్. 30

క. "దనుజాంతక ! నీ వుండఁగ
దనుజులకును, మృగములకును ♦ దలఁకఁగ నేలా ?
నినుఁ బాసిన మన నేర్తునె ?
జననుత! పతిఁ బాయఁ దగునె?♦సాధ్వుల కెందున్?"

క. అని పలువిధముల వేఁడఁగ
జనకసుతన్ బ్రేమ మీఱ ♦ జననాథుఁడు తోఁ
డ్కొనిపోవ సమ్మతించెను
వనితామణి పయనమయ్యె ♦ భావం బలరన్. 32

తే. గీ. అంత సౌమిత్రి రౌద్రుఁడై ♦ "యవనిపతిని
గైక నిలఁ గూల్చి వేగ జ ♦ గంబు మెచ్చఁ
జేయుదును నీకుఁ బట్టాభి ♦ షేక" మనఁగ
రామచంద్రుఁడు వచియించెఁ ♦ బ్రేమ గదుర. 33

మ. 'అరయన్ భూమియు, రాజ్యమున్, ధనము, దే
హంబున్, మహాసౌధముల్,
తరుణుల్, సూనులు, దివ్యవస్త్రములు, ర
త్నంబుల్ సమస్తంబు న
శ్వర మంచున్ మది నమ్మి, వీనికొఱకై
జ్ఞానుల్, వికారాత్ములై
వరధర్మంబుఁ బరిత్యజింప రనుజా !
వాంఛల్ కడున్ హేయముల్. 34

తే. గీ. శాశ్వతంబగు ధర్మంబు ♦ సలుపనెంచి
కానలకు నేఁగఁబూనితిఁ ♦ గైక మున్ను
బ్రేమ నన్నుఁ జూచు నేఁ డిట్లు ♦ విధివశమునఁ
గోరె, జననీజనకులపైఁ ♦ గోప మేల ?' 35

క. అని యుపశమింపఁజేయఁగ
ననుజుండును బయనమయ్యె ♦ నడవుల కంతన్
ధనువులు వల్కలములు నా
దినకరకులవరులు దాల్చి ♦ తేజం బొప్పన్. 36

తే. గీ. తన్మాతనయతోడ భక్తి న ♦ మస్కరించి
గురుజనాశీర్వచనములఁ ♦ గొనుచు వెడల

మహిని హా! హా!! రవంబులు ♦ మాఱుమ్రోయ
రామవిరహాగ్ని కోర్వక ♦ రాజనగర
మడలుచున్నవిధంబున ♦ నపుడు తోఁచె. 37

తే. గీ. ప్రేమ రాముఁడు వారింప ♦ వినక ప్రజలు
భూరితమసాతటంబును ♦ జేరుదనుక
దుఃఖభరమున నరుదెంచి ♦ తోయజాప్తుఁ
డస్తమింపఁగ విశ్రాంతు ♦ లైరి యచట. 38

సీ. పౌరులు నిద్రావి ♦ వశులైన పిమ్మట
రామలక్ష్మణులును ♦ భూమిసుతయు
నర్ధరాత్రంబున ♦ నటనుండి వెడలి రా
యరుణోదయంబునఁ ♦ బురజనమ్ము
మేల్కాంచి, దుఃఖించి ♦ మేదినీశుం డిట్లు
మోసగించె నటంచుఁ ♦ బురికిఁబోయి;
రచ్చట రాముఁడు ♦ లఘువినాశిని యగు
భాగిరథిని జేరి ♦ బాల్యమిత్రుఁ

తే. గీ. డైనగుహునావచేఁ బ్రవా ♦ హంబు దాఁటి
కానసంబుఁ బ్రవేశించి, ♦ ఘనతపస్వి
యగుభరద్వాజు దర్శించి ♦ యాశ్రమమున
విశ్రమించి రారేయిని ♦ బ్రియమెలర్ప. 39

సీ. భూవరుం డచ్చటఁ ♦ బుత్రవియోగదుః
ఖాగ్నిసంతప్తుఁడై ♦ యనియె నిట్లు
"వేఁటనాడుచు నేను ♦ బిన్నతనంబున
సరయూతటంబున ♦ జన్మసురుండు

కుండతో జలముఁ గై ♦ కొనుచుండ, బుడబుడ
ధ్వని విని దంతిర ♦ వముగ నెంచి
శరము నేయంగ భూ ♦ సురుఁ డుసురులఁ బాసె
నతనిమాతాపిత ♦ లంధు లపుడు

తే. గీ. పుత్త్రశోకంబుచే మృతిఁ ♦ బొందు మనుచు
నన్ను శపియించి, చింతఁ ద ♦ నయుఁ దలఁచుచు
స్వర్గమున కేఁగి రాశాప ♦ ఫలము నాకుఁ
గలిగె"నని విలపించుచుఁ ♦ గాంత లడల. 40

తే. గీ. రామ ! రామా! యటంచు నా ♦ రాజవరుఁడు
నందనుల్ చన్నయాఱవ ♦ నాఁటిరాత్రి
పరమపదమును బొంద నా ♦ ప్రభువుఁ దలఁచి
యుర్విజన మెల్లఁ బరితాప ♦ మొంది రపుడు. 41

సీ. అంత మంత్రులు వసి ♦ ష్ఠాదిమహర్షులు
ధరణీశు దేహంబుఁ ♦ దైలమందు
భద్రంబుగా నుంచి ♦ భరతశత్రుఘ్నులఁ
దోడ్కొనిరా నంప ♦ దూత లరిగి,
యాదుఃఖవార్తల ♦ నెఱిఁగింపకయ వేగ
వారలఁ గొనిరాఁగఁ, ♦ బతి దివమున
కరిగి పదేనునా ♦ ళ్ళయ్యెఁ, గుమారు ల
ప్పురవరంబును గాంచి ♦ భూరిశంక

తే. గీ. నేలొకో! పాడుపడియుండె? ♦ ని ట్లటంచు
సత్వరంబుగఁ గైకేయి ♦ సదనమునకు

నరిగి జనకునికుశలంబు ♦ నడుగఁ బ్రేమఁ
దెలిపె సర్వంబు సూనున ♦ కెలమిఁ దల్లి. 42

సీ. ఆమాటలకును దుః ♦ ఖాగ్రహాదగ్రుఁడై
"యోమహాపాపిని! ♦ యోపిశాచి!
రాముఁ గానల కంపి ♦ రాజచంద్రుని జంపి,
యపకీర్తి నాతల ♦ యందు నింపి,
కారించితే నన్ను ♦ ఖలచిత్త నినుఁ జంప
నాగ్రహించును రాముఁ ♦ డనుచు వెఱచి,
విడిచితి నింక నే ♦ వీక్షింప నీముఖం"
బనుచుఁ గౌసల్యాగృ ♦ హమున కరిగి
తే. గీ. యమ్మహాసాధ్వి కఠినోక్తు ♦ లాడ మదిని
భూరిదుఃఖాగ్నితప్తుఁడై ♦ పుడమి వ్రాలి
శపథములు పల్కఁ దొడఁగె "నో! ♦ జనని రాము
గహనవాసంబు నెఱుఁగుదు ♦ ష్కర్మపరుఁడు. 43

సీ. భామలపైఁ గాంక్షఁ ♦ బాయనిజడదారి
ధర్మపాలన లేని ♦ ధరణిధవుఁడు
క్రూరంబుగా నిజ ♦ దారసుతాదుల
హింసింపఁ జేయుధీ ♦ హీననరుఁడు
నుదయాస్తమయముల ♦ నిదురించుమందుఁడు
పశువుల బాధించు ♦ పరమపాపి
మిత్రుఁడ ననుచు న ♦ మ్మించి రహస్యంబుఁ
గొని వెల్లడిని జేయు ♦ కుటిలమతియు

తే. గీ. ధనముఁ గాంక్షించి తామస ♦ వరి
విక్రయించుచు వసుధ జీ ♦ వించుచుఁ
తనయ ననుగుణశీలవం ♦ తున కొ
యిచ్చువచ్చినమనుజున ♦ కిచ్చుదుష్ట
జేగతికిఁ బోవు నాగతి ♦ కేఁగుఁ గా

తే. గీ. క్షితినిఁ బాలించుకాంక్ష నా ♦ చిత్తమః
గలుగలే దెన్నఁడును, పాపి ♦ కైక
గష్టములు గల్గె" ననుచు దుః ♦ ఖ
నాతనూజుని దల్లి యూ ♦ రార్చెఁ

తే. గీ. తండ్రిమృతదేహమును గాంచి, ♦ త
యగ్నిసంస్కారవిధు లెల్ల ♦ నాచరి
"రామచంద్రుని బ్రార్థించి ♦ రాజ్యః
బ్రభుని జేయుదు" ననుచు నా ♦ భ

క. అనుజుఁడు మాత లయోధ్యా
జన మెల్లరు సంతసమునఁ ♦ జయ్య
మునివనమార్గము నరయుచు
మునిబృందము వొగడ విపిన♦భూమి కి

చ. వనమునఁ జిత్రకూటవర♦పర్వతమందు సువి
జనకతనూజయు న్గొలువ♦సాధువరేణ్యుఁ డొ
ఘనగిరి నొప్పవింతలను♦ గాంచనగాత్రికిఁ
కనుగొను మింద్రనీలమణి♦ కాంతులఁ బోలి స

చ. ఇచటిఝరీప్రవాహములు♦నిచ్చటిరుచ్యఫలోదకంబులున్
ఇచటిసుగంధసూనములు♦నిచ్చటిసుందరభూరుహంబులున్
ఇచటిలతానికుంజములు ♦ నిచ్చటిచల్లనికమ్మతెమ్మెరల్
ఇచటివిహంగజాతములు♦నెంతయు మోదకరంబులౌసతీ!

ఉ. భూరితపఃప్రభావు లగు♦భూసురవర్యులమైత్త్రి నిచ్చటన్
క్రూరతఁబాసి, నెయ్యమునఁ♦గూడి చరించుకురంగ కేసరీ
వారణధేనుఖడ్గమృగ ♦ భల్లుకసూకరబృంద మల్లదే !
వారిజపత్రనేత్ర!"యని♦ భావము రంజిలఁ బల్కునత్తఱిన్.

క. జనకలకలనాదము విని,
ఘనధూళియు నెగయఁ గాంచి, ♦ కాకుత్స్థవరుం
"డనుజా ! హేతువు నారయు" !
మన భూజము నెక్కి, చూచి,♦యాగ్రహ మొదవన్.

చ. కని యతఁడన్న కిట్లనియెఁ
"కైకతనూజుఁడు రాజ్య మెల్లఁ గై
కొనియును దృప్తినొందక ర
ఘుప్రవరా ! నిను గెల్వ సేనతో
నని కరుదెంచె ; వేగమ శ
రాసనమున్ ధరియింపు మాజి నా
తనిని సబాంధవంబుగ హ
తంబొనరింత" మటంచు రౌద్రుఁడై.

చ.అన విని రామచంద్రుఁడుద♦యారసపూర్ణుఁడుపల్కెలక్ష్మణా!
యనుపమభక్తుఁడౌభరతు♦నప్రియముల్వచియింపరాదిఁకన్

వనమునకిట్లు ముప్పూరము♦వచ్చినవార్త నెఱింగి, రాజ్యము
గాన మది నిచ్చ లేక ననుఁ♦గూర్కి మరల్పఁగవచ్చెనమ్మ మా!"

తే. గీ. అనుచు శాంతింపఁజేయ దుః ♦ ఖాశ్రువులను
భరతశత్రుఘ్ను లరుదెంచి ♦ భక్తిమీఱఁ
జరణకంజంబులను వ్రాలఁ, ♦ గరుణ నెత్తి
యగ్రజుఁడు కౌఁగిలించుచు ♦ నాదరించి. 54

తే. గీ. తండ్రిమరణంబు నాలించి, ♦ తల్లడించి
భక్తి శాస్త్రోక్తముగ నివా ♦ పములు విడిచి,
యెల్లవారలకుశలంబు ♦ నింపు గదుఱ
నరయఁ జింతించి రిబ్భంగి ♦ నఖిల జనులు. 55

సీ. "శ్రీలొప్ప నవరత్న ♦ సింహాసనస్థుఁడై
ధర్మచక్రి మేలు ధీ ♦ శౌర్యరాశి.
లాలితకాంచన ♦ చేలంబులను దాల్చి
రాజిల్లు శ్రీరఘు ♦ రామవిభుఁడు
షడ్రసోపేత రు ♦ చ్యపదార్థజాలంబు
భుజియించుదశరథ ♦ భూపసుతుఁడు
మణిమయహర్మ్యసం ♦ వాసియై మృదుతల్ప
ములఁ బవ్వళించు కో ♦ మలశరీరి

తే. గీ. పుణ్యచరితుండు కానన ♦ భూమి నిటులఁ
బర్ణశాలను ఘనజటా ♦ వల్కలములఁ
దాల్చి, వనఫలభోజియై ♦ తాపసేంద్రు

పగిది, దర్భాసనంబున ♦ వఱలుచుండఁ
బాడుకన్నుల నేఁ డిట్లు ♦ చూడవలసె." 56

సీ. అంత భరతుఁడు కృ ♦ తాంజలియై వేఁడె
"నన్న ! నామనవి నీ ♦ వాదరింపు,
కలుషాత్మయైనయా ♦ కైకేయిమాటలఁ
బాటింపవలదయ్య ! ♦ పరమపురుష
రాజ్యంబు నీయది ♦ రాజేంద్ర ! కొను మింక
నేను సేవించెద ♦ నీపదములు
పురికి రావేని యో ♦ భూనాథ ! నేనును
నినుఁ గొల్చుచుందు ని♦వ్వనమునందె"

తే. గీ. యనుచు వేఁడఁగ శ్రీరాము ♦ డనుజ ! మనము
తండ్రివాక్యంబుఁ జెల్లింపఁ ♦ దగును గాన
నబ్దములు పదునాలుగు ♦ నైనవెనుక
వచ్చి రాజ్యంబుఁ గొని నీదు ♦ వాంఛఁదీర్తు. 57

చ. జనకునిసత్యమున్నిలుప♦జ్యోతల మేలుమ, యెన్న డేనియున్
మనమున నైనఁ దిట్టకుమ♦మాతను గైకను భక్తిఁగొల్వుమా
యని దృఢనిశ్చితుండగుచు♦నగ్రజుఁడాడినఁ గైకనూనుఁడా
జనపతినిశ్చయంబునకుఁ♦జాలవిచారమునొంది యిట్లనెన్.

ఉ. "భానుకులేశ ! నీపరమ ♦ పావనపాదుకలైన నిచ్చినన్
వానినె నిన్నుఁగాఁదలఁచి♦భక్తిని గొల్చుచు భూమిఁగాతు నే
నో నరనాథ ! మీ రడవి♦నొక్కఁడినంబును నాలసించినన్
మానక యగ్నిఁజొత్తు నను♦మానములే" దనెనెల్లరాననన్.

ఆ. వె. పరమభక్తుఁ డైన ♦ భరతునిమాటల
కలరి రాముఁ డొసఁగె ♦ నాదరమునఁ
బరమపూజ్య మైన ♦ పాదుకాద్వితయంబు
ననుజుఁ డమలభక్తి ♦ నందుకొనియె. 60

తే. గీ. భద్రనాగంబుపైఁ బెట్టి ♦ పాదుకలను
భరతశత్రుఘ్ను లిరువురుఁ ♦ బట్టి రపుడు
ఛత్రచామరములను దే ♦ జంబు మీఱ
నగ్రజునిమాఱుగా నెంచి ♦ యరిగి రంత. 61

సీ. రామచంద్రుఁడు లేని ♦ రాజధానిని బ్రవే
శింప నొల్లక కడుఁ ♦ జింతతోడ
వినుతనందిగ్రామ ♦ మున నిల్తు నని యట
విడిసి, యాభరతుఁడు ♦ వినయ మొప్పఁ
బట్టాభిషేకంబుఁ ♦ బాదుకలకుఁ జేసి
భక్తిఁ బూజింపుచు, ♦ వానిపేర
ధరను రక్షింపుచుఁ ♦ దపసివేషముఁ దాల్చి
పట్టణంబున కంపె ♦ బాంధవులను

ఆ. వె. భక్తవర్యుఁ డైన ♦ భరతుని గన్గొని
సకలజనులు మెచ్చి ♦ సన్నుతించి,
రతనియాజ్ఞ నెన్నఁ ♦ డడుగు దాఁటకయుండి
పరమసౌఖ్యములను ♦ బడసి రపుడు. 62

క. వారాశిభవ్యమందిర!
వారిదనిభదివ్యగాత్రి! వారణవరదా!
శారదచంద్రిసుధార్ణవ
హీరయశస్సాంద్రి! త్రిజగదీశ్వర! కృష్ణా! 63

—* గద్యము *—

ఇది శ్రీమద్గుంటూరుపురఖేల వేణుగోపాల వరప్రసాదలబ్ధ
కవిత్వ శాండిల్యసగోత్ర మాచిరాజు సౌభాగ్యలక్ష్మ్యాం
బికా సుబ్బరాయామాత్యతనూజ, కౌండిన్యసగోత్ర
దేచిరాజు శేషాంబారామచంద్రరాయతనూభవ
రామరాయాఖ్య ధర్మపత్నీ లక్ష్మీనరసమ్మ
నామ్నా విరచితం బైన శ్రీరామచరిత్రం
బనునిర్వచనకావ్యంబున
నయోధ్యాకాండము.

—✻—

శ్రీః

శ్రీమద్వేణుగోపాలస్వామినే నమః



# శ్రీరామచరిత్రము

## ఆరణ్యకాండము



కృష్ణా! యదుభూషణ!
కాకోదరనాథగర్వ ♦ కాననదహనా!
శ్రీకరకౌస్తుభవక్షా!
ప్రాకటదరచక్రివంశ ♦ పంకజహస్తా!

సీ. అవనిజాసహితులై ♦ యర్కకులోత్తముల్
సేమంబుతోడ నా ♦ చిత్రకూట
మును వీడి, దండకా ♦ వనిఁ జొచ్చి, మునులచే
నందందు సత్కృతు♦లగుచు మిగులఁ

గరకశభూములఁ ♦ గాంతామతల్లితో
మెల్లన నడచుచు, ♦ మేదినీశుఁ
డతికూర్మిఁ గై దండ ♦ నాసాధ్వి కొసఁగుచు
నామెధైర్యమునకు ♦ హర్షఁ డగుచు

తే. గీ. వనవిశేషముల్ సూపుచు, ♦ వనజముఖికి
భూరుహచ్ఛాయలందునఁ ♦ బుణ్యశీలు
రచ్చటచ్చట నిలుచుచు ♦ నరుగుచుండ
నమ్మహాత్ములఁ గనుగొని ♦ యాటవికులు. 2

మత్త. భూరితాపసవేషులై రిటు ♦ భూమిపాలు రిదేలొకో!
మారరూపులు! మాననీయులు, ♦ మానినీసహితంబుగా
ఘోరకాననసీమ నివ్విధిఁ ♦ గ్రుమ్మరంగ, ఫలానిలా
హారులై కృశియింప వీరల ♦ కవ్విధాత లిఖించెఁగా! 3

సీ. అనుచుఁ జింతింప న ♦ మ్మనువంశశేఖరు
లత్రిసుతీక్ష్ణా ♦ ద్యలఘుమునుల
యాశ్రమంబులయందు ♦ విశ్రమించుచు మార్గ
మున నెదుర్కొనుక్రూర ♦ దనుజవిభులఁ
దునుముచు మోదంబు ♦ మునుల కొసంగుచు
సంయమినికరక ♦ ష్టములు వినుచు
నవ్యాజకరుణతో ♦ నభయంబు లొసఁగుచు
గౌతమీతటిని బ్రి ♦ ఖ్యాతమైన

తే. గీ. పంచవటిఁ జేరి యచ్చనిఁ ♦ బర్ణశాలఁ
గట్టి, యందు వసింపుచుఁ ♦ గౌతుకమున

భూతనయతోడ గోదావ ♦ రీతటము
విహారణంబులు సేయుచు ♦ విమలయ

సీ. అకలంకజలపూర్ణ ♦ మైనగోదావరీ
ధ్వను లొప్పె మేఘుగ
ఫలభారమున వంగి ♦ భాసిల్లుజంబీర
పనసరసాలాది ♦ పాం
లమలభక్తిని బ్రిహ్వా ♦ హామునకు వ
మాచరింపఁగఁ బూని
యువతి! వీక్షింపు మ ♦ హోన్నతగి
భర్మరజతతామ్రి ♦ ః

తే. గీ. కమలచంపకకుందసు ♦ గంధయుక్త
మారుతంబులు నీదేహ ♦ సౌరభముల
మైత్రిఁ గోరుచు వచ్చిన ♦ మాడ్కి
సౌఖ్యమును గూర్చెఁగాదె! యో ♦

సీ. లాలితచూతప ♦ ల్లవములఁ గడుపార
భక్షించి కోయిలల్ ♦
సకియ! నీగానంబు ♦ సరిఁ బాడఁజాల
యభ్యసింపఁ దొడంగె ♦
చంద్రాస్య! నినుఁ గని ♦ సంతోష
గొలఁకుల వికసించెఁ ♦ గ
దాడిమీఫలములఁ ♦ దనివితీఱ భుజించి
పలుకుచుండెడిరామ ♦ చి

తే. గీ. నీమృదూక్తులవలెఁ బల్కు ♦ నేర్చుకోర్కెఁ
బరమకృషిఁ జేయుఁదొడఁగెను ♦ తరుణి! వింటె!
నీవిశాలాక్షులను గాంచి ♦ నిడుదలజ్జఁ
బరుఁగు లిడసాగెఁ జూచితే ♦ హరిణచయము"
లనుచు సీతకుఁ జూపుచు ♦ నలరుచుండె. 6

సీ. ఇట్లుండ నొక్కనాఁ ♦ డినకులాభరణుని,
దైత్యాన్వయేశుసో ♦ దరి కనుఁగొని!
కామించి వచ్చి "యో ♦ రామ! శూర్పణఖను
నను వరియింపుము ♦ నళిననేత్ర!"
యని వేఁడ రాముఁ "డీ ♦ యతివ యున్నది నాకు
లక్ష్మణుఁ గోరుము ♦ లలన!" యనఁగ
నాదైత్యవనిత రా ♦ మానుజునిం గని
'పెండ్లాడు' మనియెను ♦ బ్రీతిమీఱ

తే. గీ. "నేను రామునిభృత్యుఁడఁ ♦ గాన నన్నుఁ
బరిణయం బాడ సేవింప ♦ వలయు నొరుల
రామచంద్రు వరింపుము! ♦ రాణి వౌదు"
వనియె సౌమిత్రి యంత న ♦ య్యసురకాంత. 7

ఆ. వె. "సీత యుండ నన్నుఁ ♦ జేపట్ట నొల్లఁడు
నీచురాలు దీని ♦ నే భుజింతు"
ననుచు హుంకరింప ♦ నవనిజ భీతిల్ల
నధిపుఁ డాగ్రహించి, ♦ యనుజుఁ బిలిచె. 8

తే. గీ. రాముచేసన్న నతఁడు క ♦ ర్ణద్వయంబు,
నాసికంబును దునుమ బా ♦ సవి యడలుచు

ఖరున కెఱింగింప నాతఁ డా ♦ గ్రహము
దూషణత్రిశిరాదుల ♦ తోడ వచ్చె.

తే. గీ. వీరదైత్యులఁ బదునాల్గు ♦ వేలఁ గాంచి,
నృపతి సతిఁ గావఁ దమ్ముని ♦ నిలిపి వేగ
నలఘుభుజశౌర్య మెసఁగ నా ♦ హవ మొ
శరపరంపరఁ గురిసి రా ♦ క్షసుల నెల్ల.

తే. గీ. దుర్మదాంధుల నాఖర ♦ దూషణులను
గూల్చె రుధిరప్రవాహంబు ♦ క్షోణిఁ బాఱ
దైత్యసంహారమును గాంచి ♦ తాపసాళి
"తీరెఁ గష్టంబు" లనుచు ను ♦ తించి రెల

తరళ. "ధరణిజాహృదయాబ్జఖేలన!♦దైత్యగర్వవి
తరణివంశసుధాబ్ధిచంద్రమ ! ♦ తాపసాళిశరణ్య
దురితభంజన ! భక్తరంజన ! ♦ దుష్టదానవబృంద
ధరణిఁగూల్పఁగ మోదమయ్యెను♦ధర్మరక్షక! యి

తే. గీ. అనుచుఁ గొనియాడి రంత న ♦ య్యసుర
రావణున కిది తెలిపి "యా ♦ రాముసతిని
రూపవతిఁ గొ"మ్మటంచు దు ♦ ర్బుద్ధిఁ గఱ
నతఁడు మారీచుఁ గాంచి యి ♦ ట్లనియెఁ బీ

శా. "మారీచా ! విను రాముఁ డవ్వనమునన్
మాసీందుర్లలఁ బ్రోవఁగా
వీరాగ్రేసరులౌ ఖరాదులను జం
పెన్ గాన వేవేగ నా

శూరున్ దండితుఁ జేయ నాతనిసతిన్
శోభాంగినిం దెత్తు నే
నారామున్ హరియింపఁ దోడ్పడవె ! నా
యాప్తుండ వీవే కదా !" 14

ఉ. కావున వేగ రమ్యతర ♦ కాంచనవర్ణకురంగరూపవై
భూవరు లుండు తావునకుఁ♦బోయి ముదంబున సంచరింపు నే
నావనసీమ డాఁగి యవు ♦ డాసతిఁ దెచ్చెద వంచనక్రియన్
నీవిఁక నేఁగుమీ!" యనఁగ♦నీతియుతంబుగ నాతఁ డిట్లనెన్.

ఉ. "రాముఁడు మానవుండనుచు♦రాక్షసనాథ! తలంపఁ బోల దీ
భూమిని దైత్యబృందములఁ♦బోరనశింపఁగఁ జేయుఁ బుట్టె నా
శ్రీమహిళేశుఁడే యతఁడు♦సీతను గోరకుమయ్య! నీకు నా
భామిని మృత్యువే యగును♦బాగుగ నమ్ముము! దీని నెమ్మదిన్

తే. గీ. "గాధితనయునియాగర ♦ క్షణదినమున
నతని బాల్యంపుఁదీవ్రసా ♦ యకనిహతుఁడ
నగుచు గాసిలి పడితి నీ ♦ యబ్ధిఁగాన
నరుగ వెఱతు"; ననఁగ నాతఁ ♦ డాగ్రహించి. 17

ఆ. వె. "అసురమర్దనమున ♦ కవతరించినయెడ
వెఱచినంత నన్ను ♦ విడువఁబోఁడు
గాన నిర్భయముగఁ ♦ గాంక్షింతు సీతను
భీతి నొంద నిన్నుఁ ♦ బీఁచ మడఁతు !" 18

తే. గీ. తమ్ములను ఖరదూషణ ♦ దానవులను
క్షితిని గూల్చిననరుని శి ♦ క్షింప కేను

విడుతునే!" యన భీతుఁడై ♦ "వీనిచేతఁ
జావ నేటికి? శ్రీరామ ♦ సాయకమున
దేహమును వీడి శీఘ్రింబ ♦ దివముసొత్తు." 19

తే. గీ. అంచు నాతఁడు కాంచన ♦ హరిణరూప
మలరఁ దాలిచి, వెడలి, రా ♦ మాశ్రమంబు
చెంత విహరించుచుండ వీ ♦ క్షించి సీత
కౌతుకంబునఁ గోరె భూ ♦ కాంతు నపుడు. 20

తే. గీ. "మాయమృగ మిది" యనుచు ల♦క్ష్మణుఁడు దెలుప
"జింక యైనను నెఱవేర్తు ♦ సీతకోర్కి
ననురుఁ డైన వధింతు మ ♦ హర్షు లలర
జనకతనయను గాపాడు" ♦ మనుచు నృపతి. 21

తే. గీ. విల్లునమ్ములు గైకొని ♦ వెడల లేడి
యందునట్లు నటించుచు ♦ నధికదూర
మరుగఁ, బతి యొకతీవ్రసా ♦ యకముఁ గినుక
నేయ "హా! సీత! హా! లక్ష్మ ♦ ణా!" యటంచు
దైత్యుఁ డిలఁగూలె నృపతిడెం ♦ దంబు కలఁగ. 22

తే. గీ. సీత యా కేకలను విని ♦ చింత నొంది
"యన్న! లక్ష్మణ! వింటివె! ♦ యార్తరవము
కుటిలదైత్యునిచే రఘు ♦ కుంజరునకు
నేద్దియో హాని కలిగె నీ ♦ వేఁగు" మనఁగ. 23

సీ. "తల్లి! యారావంబు ♦ దానవునిది గాన
విపరీతభావంబు ♦ వీడుమమ్మ!

అర్కవంశోత్తముఁ ♦ డాపద నొందిన
వసుధ కంపింపదే? వలదు భయము!
వారిధు లింకవే? ♦ వనజమిత్రశశాంక
తారకాబృంద మిా ♦ ధరణిఁ బడదె?
ఇవి నిశాచరమాయ ♦ లీ వింక వీనిని
నమ్మవలదు! నేఁడు ♦ నన్నుఁ బంప
తే. గీ. నీ కపాయము చేకూరు ♦ నిక్కవముగ"
ననఁగ వైదేహి మఱఁదిపై ♦ నాగ్రహించి
"ఆర్తుఁడై యన్న పిలువ నీ ♦ వరుగ వకట!
నీమనంబు గ్రహించితి ♦ నీచహృదయ!" 24

చ. అనయముఁ దమ్ముఁ డంచు మిము ♦ నాత్మ నరేంద్రుఁడు విశ్వసించు నా నివ్విధిన్
యనుజుఁడు రాజ్యముం గొని వ ♦ నాంతరసీమకుఁ బంపె
దనుజులు వల్లభు న్దునుమఁ ♦ దద్దయు వేడుక నన్నుఁ గైకొనన్
వనమున కీవు వచ్చితివి ♦ భక్తుని కైవడి నన్ను వెంబడిన్.

కం. నినుఁ గైకొందునె? నే నా
జనవంద్యుఁడు రానియెడల ♦ జలములనైనన్
ఘనవహ్నినైన వెస నా
తనువు విసర్జింతు నిచటఁ ♦ దథ్యము పాపీ!" 26

తే. గీ. అనుచు వల్లభుఁ దలఁచి ప్రే ♦ మాతిశయము
చేత నజ్ఞాన మొలయ నా ♦ సీత వల్క,
హరి! హరీ! యని కర్ణద్వ ♦ యంబు మూసి
యనఘశీలుఁడు లక్ష్మణుం ♦ డనియె నిట్లు. 27

తే. గీ. నేయపాయంబు కలిగెనో ! ♦ యిప్పు" డనుచుఁ
బరితపించుచు వచ్చి య ♦ ప్పర్ణశాల
యందు సీతను గానక ♦ యధికశోక
విహ్వలుండై విపినమున ♦ వెదకఁదొడఁగె. 38

సీ. "హా ! ప్రియసుందరీ ! యసురులచే నేమి
యాపద నొందితో!♦యబల ! యిప్పుడు
కుటిలకుంతల! నిన్నుఁ ♦ గ్రూరమృగంబులే
భక్షించెనో గదే ! ♦ పద్మగంధి !
ఏణాక్షి ! హరిణంబు ♦ నేటికిఁ గోరితే
నే నేల యేఁగితి ? ♦ నిన్ను వీడి
అడవికి నాతోడ ♦ నతిభక్తిఁ జనుదెంచి
కష్టంబు లెంచవు ♦ కమలవదన !

తే. గీ. సేవఁ జేయుదు వెపుడు నా ♦ చిత్త మెఱిఁగి
పరమసాధ్వీమణీ ! నినుఁ ♦ బాసి యిఁకను
భువిని మననోల్ల" ననుచు నా ♦ భూవరుండు
దుఃఖహుతవహతప్తుఁడై ♦ దొరలుచుండ. 39

సీ. అనుజన్ముఁ డతిచింత ♦ నాలింగనముఁ జేసి
"యన్న! యీరీతిదుః ♦ ఖార్ణవమున
మునుఁగఁ గార్యము సెడు ♦ మనమున నోరిమి
వహించి వేగ భూ ♦ వలయమెల్ల
గాలించి, వైదేహిఁ ♦ గనుఁగొనఁ దగు" నంచు
ధైర్యంబుఁ గఱప నా ♦ ధరణినాథుఁ

దనుజసమేతుఁడై ♦ యడవుల వెదకుచు
"హరిణంబులార! వి ♦ హగములార!

తే. గీ. భూరుహములార ! కంటిరే ! ♦ భూతనూజ"
ననుచు నడలుచుఁ జనుచుండ ♦ నఖిలభూత
నికరములు మేతలను వీడి ♦ నిండుచింత
దక్షిణపుదిశఁ బతికి నే ♦ త్రములఁ జూప. 40

తే. గీ. వానిభావంబు నరయుచుఁ ♦ బరమచింత
నరుగుచుండఁగ నొకచోట ♦ నవనిఁ దెగిన
ఖగవరుఁడు కానఁబడి చెప్పె ♦ క్ష్మాధవునకు
"రావణుండు హరించె ధ ♦ రణిజ" ననుచు. 41

తే. గీ. అని జటాయువు తెలిపి దే ♦ హంబు విడువ
క్ష్మాధవుఁడు కడుఁ బ్రేమ సం ♦ స్కారములను
సలిపి పరమపదంబు నొ ♦ సంగి వేగ
నరిగె దక్షిణముఖముగ ♦ ననుజుతోడ. 42

సీ. మార్గమధ్యమున న ♦ మ్మహనీయులఁ గబంధ
దనుజుఁడు మ్రింగ రా ♦ దాశరథులు
తెగటార్ప, నాతఁడు ♦ దివ్యరూపము నొంది
"ఘనులార! నే నొక్క ♦ గగనచరుఁడ!
నుగ్రకర్మండనై ♦ యొకమునిశాపంబు
నొంది, దానవుఁడనై ♦ యుండి నేఁడు
మీకృపవలన నా ♦ మేనిఁ గ్రమ్మరఁ గంటి
మీకు శుభంబగు ♦ మిత్రసూను

తే. గీ. కడకుఁ బొం"దని చెప్ప నా ♦ గగనచరుని
మాటలను విశ్వసించి య ♦ మ్మానసీయు
లినతనూజుని గనుఁగొన ♦ నేఁగుచుండ
దారిమధ్యంబునం దొక్క ♦ ధన్యచరిత ! 43

తే. గీ. శబరి యనుతాపసాంగన ♦ సత్కరింపఁ
బుణ్యలోకంబు లొసఁగి, య ♦ ప్పుడమిఱేండ్లు
పద్మశోభితవిమలపం ♦ పాతటమున
కవనిజాత సరయుకాంతు ♦ నరిగి రంత. 44

క. కుంతీసుతసంరక్షక !
దంతావళమదవిదారి ! ♦ దానవవైరీ !
శాంతదయాకర ! వల్లవ
కాంతాజనచిత్తచోర ! ♦ కంధివిహారా ! 45

— * గద్యము * —

ఇది శ్రీమద్గుంటూరుపురఖేల వేణుగోపాల వరప్రసాదలబ్ధ
కవిత్వ శాండిల్యసగోత్ర మాచిరాజు సౌభాగ్యలక్ష్మ్యం
బికా సుబ్బరాయామాత్యతనూజ, కౌండిన్యసగోత్ర
దేచిరాజు శేషాంబా రామచంద్రరాయతనూభవ
రామరాయాఖ్య ధర్మపత్ని లక్ష్మీనరసమ్మ
నామ్నా విరచితం బైన శ్రీరామచరిత్రం
బనునిర్వచనకావ్యంబున
నారణ్యకాండము.

శ్రీః

శ్రీమద్వేణుగోపాలస్వామినే నమః



# శ్రీరామచరిత్రము

## కిష్కింధాకాండము





శ్రీ తులసీదామా! నవ
నీతప్రియ! వేణుగాన ♦ నిరతాత్మా! యశో
దాతన్వీగర్భాంబుధి
శీతకిరణ! కంసహరణ! ♦ శ్రితజనభరణా!

క. మునివేషంబులు దాలిచి
ధనువులు చేఁబూని తిరుగు ♦ దశరథసుతులన్
వనచరపతి సుగ్రీవుఁడు
కని భీతుం డగుచుఁ బల్కెఁ ♦ గరువలిసుతుతోన్.

ఆ. వె. "వాలి యనుప వీరు ♦ వచ్చినా రని తోఁచెఁ
బవనతనయ ! వేగ ♦ వారికడకు
నరిగి సర్వ మరసి ♦ యరుదె"మ్మనఁగ నేఁగి
వందనం బొనర్చి ♦ పలికె నిట్లు." 3

సీ. "కందర్పరూపులు, ♦ ఘనులు, రాజులు మీరు
మునివేషధారులై ♦ వనమునందు
సంచరింపఁగ నేల ? ♦ సరగున నెఱిఁగింపుఁ"
డనఁగ రామానుజుం ♦ డాదరమున
"దశరథాత్మజులము, ♦ తండ్రిపంపున వచ్చి
పంచవటీనామ ♦ వనమునందు
భూసుతఁ గోల్పోయి, ♦ భూముల వెదకుచు
వచ్చినార మిటకుఁ ♦ బ్లవగవర్య!
తే. గీ. నీదునామంబుఁ దెలుపుమీ ! ♦ మోద మలర"
ననఁగ నంజనాతనయుఁడు ♦ హర్ష మొంది
"వనజహితనందనుం డగు ♦ వనచరేంద్రు
సచివుఁ డను నేను జననుత ♦ చరితులార ! 4

సీ. హనుమదాఖ్యుండ నే ♦ నంబుజాప్తసుతుండు
వాసవి కోడి యి ♦ ప్పర్వతమున
నివసించుచున్నాఁడు ♦ నేఁడు నాతో మీరు
దయచేయుఁ డట"కని ♦ దాశరథుల
ఋశ్యమూకస్థుఁడౌ ♦ వృక్షచరేంద్రుని
కడకుఁ గొంపోయి, యా ♦ ఘనులచరిత

వినిపింప నాతఁడు ♦ వినయమునను వారిఁ
బూజించి యనిమెఁ "బూఁ♦బోఁడియొక తె

తే. గీ. దానవునితోడ నంబరా ♦ ధ్వమునఁ జనుచు
మూట యొక్కటి పడవైచి ♦ పోయె రామ !
చూడు !" మన దానిఁ గనుఁగొని ♦ 'సుదతిమేని
భూషణము'లని ఘనచింతఁ ♦ బుడమి వ్రాలె. 5

క. హా ! రామామణి ! సీతా !
యారావణుచేతఁ జిక్కి ♦ యనదవలె న్నీ
వేరీతి నడలుదానవో !
ఘోరాపదలకును నిట్లు ♦ గురివైతి వయో !" 6

తే. గీ. అనుచు విలపింప సుగ్రీవుఁ ♦ "డనఘ! యింకఁ
జింతవీడుము నే నతి ♦ శీఘ్రముగను
జగము నంతయు వెదకి యా ♦ జనకజఁ గని
వచ్చుటకుఁ బంపుదును గీశ ♦ వరగణమును." 7

క. అని మోదార్చి ప్రియంబున ;
జనపతికిం దెలిపె నిట్లు ♦ చండకిరణనం
దనుఁ డతిసంతాపంబునఁ
దనచారిత్రంబు నెల్లఁ ♦ దగువచనములన్. 8

సీ. "మాయావితోఁ బోర ♦ మాయన్న మున్ను ద
రీద్వారమున నన్నుఁ ♦ బ్రేమ నిలిపి
గహ్వరంబునఁ జొచ్చి ♦ కదనం బొనర్చె నే
నగ్రజు నానతి ♦ నచట నుండ

నేఁడాది గడచియు ♦ నెఱుఁగనైతిని వాలి
జాడను ; మఱియును ♦ జండదనుజ
ఘోషణాలాపముల్ ♦ వినఁబడ సాగెను
రక్తప్రవాహముల్ ♦ రాఁ దొడంగె

ఆ. వె. నంత వాలి యచట ♦ హతుఁడయ్యె నని యెంచి
బిలముఖమున నొక్క ♦ పెద్దబండ
నడ్డువైచి నగరి ♦ కరిగితిఁ జింతతో
రాజు నైతిఁ బిదప ♦ రాజ్యమునకు. 9

తే. గీ. కొంతకాలము గడువఁగఁ ♦ గుపితుఁ డగుచు
వాలి యరుదెంచి, ననుఁ గాంచి, ♦ "పాపి ! నిన్నుఁ
దమ్ముఁడని ప్రేమ నేమది ♦ నమ్మియుండ
బిలమునకు రాతి నడ్డము ♦ పెట్టి వచ్చి. 10

తే. గీ. రాజ్యమును గొంటి విఁక నమ్మ ♦ రాదు నిన్ను"
ననుచు నిందింప నిట్లంటి ♦ నగ్రజునకు
"నచట నొకయేఁడు వేచి నీ ♦ వసురుచేత
హతుఁడవై యుందు వనుచు గు ♦ హాముఖమున. 11

తే. గీ. రాతి నడ్డము వైచితి ♦ రక్కసునకు
బయటి కరుదేరకుండఁగఁ ♦ బ్లవగవర్య !
కొనుము రాజ్యంబు నీ విఁకఁ; ♦ గొలుతు నేను !
నిన్ను నెప్పటివలె" నని ♦ విన్నవించి. 12

చ. చరణములందు వ్రాలి "యిది ♦ సత్యమునమ్ము" మటంచు వేఁడన
త్తరుచరవీరుఁ డుగ్రమునఁ ♦ దమ్ముఁడటంచును జాలిలేక న

బురమును బాయఁగొట్టి,కడు♦మోదమునన్ గొనె నాసతిన్ రుమ
న్దరుణిని గోలుపోయి,మదిఁ♦నష్టయుఁ గుందుచునుందు నిచ్చటన్.

తే. గీ. అనుచు వివరింప జాలిమై ♦ నవనిధవుఁడు
"వాలి నిలఁగూల్చి నినుఁ గపీ ♦ శ్వరు నొనర్తుఁ
జింత వీడు"మనంగ వ ♦ చించె నతఁడు
"వాలిబలమును వినుము! భూ ♦ పాల!" యనుచు.

చ. కరములఁ బర్వతంబులను ♦ గందుకలీలల నెత్తు వేడుకన్
శరధుల గోష్పదంబులుగ♦సత్త్వము భాసిల దాఁటుఁ గేళికిన్
బురుషవరేణ్యు లెవ్వరును♦బోర నెదుర్కొనఁజాల రాతనిన్
సరసిజమిత్రవంశవర!♦శైలచరాధిపుఁ గెల్వ శక్యమే?

తే. గీ. ఇమ్మహోన్నతసాలమ ♦ హీజసప్త
కంబు నీ వొక్కశితసాయ ♦ కమునఁ గూల్ప
విశ్వసింతు" ననంగ భూ వి ♦ భుఁడు నగుచు
నట్లొనర్పఁగ సుగ్రీవుఁ ♦ డాత్మ నలరి. 16

తే. గీ. సింహనాదం బొనర్పఁ గి ♦ ష్కింధ కరిగి
వృక్షచరవల్లభుఁడు రోష ♦ వివశుఁ డగుచు
రణమునకు రాఁగఁ బోరి రు ♦ గ్రముగ వారు
తరువుచాటున నిలిచి భూ ♦ వరులు చూడ. 17

ఉ. శూరవరేణ్యులా నముచి♦సూదనభానుతనూజు లిర్వురున్
భూరుహ, శైల,వాలముల♦ముష్టులఁ బోరుచు, రక్తధారల
న్వ్వారిగ నొల్కు దేహముల♦భాసిలి రత్తఱి వృత్రశక్రులో!
వీరలనంగ బాహుబల♦విక్రమ మొప్ప మహారణంబునన్.

ఉ. రామనృపాలసోముఁడు, ఖ♦ర త్రిశిరాదివిరాముఁ డంత ను
ద్దామజవంబు మీఱ నొక♦దారుణబాణమువింటఁగూర్చి, సు
త్రామసుతున్ మహాబలుని♦రంబున నేయఁగ; వజ్రధారచే
భూమిధరంబు కూలుగతి♦భూమిపయిం బడి వాలి యిట్లనెన్.

క. "అనుజునితోఁ బోరెడునెడ
వనభూజము పొంత డాఁగి ♦ "బంటు" ననుచు ని
ట్లొనరింప నిన్ను నగరే!
జన మెల్ల" ననంగ రామ ♦ చంద్రుఁడు పలికెన్.

సీ. "అనుజన్మసతిని నీ ♦ వన్యాయముగఁ గొన
దండించితిని నేను ♦ ధర్మవిధిని
నుర్విని మృగముల ♦ నురు లొడ్డియును బొంచి
యొండొంటితోఁ బోరు ♦ చుండునపుడు
వివిధరీతులను భూ ♦ విభులు వధించెద
రది యధర్మంబుగా ♦ దధిపతులకు
శాఖామృగంబ! నిన్ ♦ జాటున నిలిచి నే
నిపుడు వధించితి ♦ నిందువలన

తే. గీ. నాకు దోషంబు లే"దన ♦ నగచరుండు
తాను జేసినదురితంబుఁ ♦ దలఁచి, వగచి,
వినయమున క్షమియింప న ♦ వ్విభుని వేఁడి
తనతనయు నప్పగించెను ♦ దాశరథికి. 21

తే. గీ. అనుజుఁ బ్రియమాఱఁ బిలిచి, తా ♦ రాంగదులను
"గావు"మని యప్పగించి, స్వ ♦ ర్గంబు నొంద

నతని కై వగచుచు వార ♦ లఖిలవిధులఁ
దీర్చి రంత నృపాలుఁ డా ♦ దిత్యతనయు 22

తే. గీ. రాజుగను, నంగదుని యువ ♦ రాజపదము
నందు, నియమించి, వారల ♦ నంపి పురికి,
ననుజయుతముగఁ బ్రస్రవ ♦ ణాద్రి నుండె
నలఘుచింతాభరమునవ ♦ ర్షాగమమున. 23

చ. ఘనగిరులట్లఁ గార్మొయిలు ♦ గ్రమ్మె దివంబునఁ, బుత్తహంతపైఁ
గనలుచు వజ్రి విల్గొనిన ♦ కైవడి నింద్రశరాసనం బెల
ర్చెను, జనకాత్మజాతకయి ♦ వేగగు దుఃఖమునం గృశించు రా
మునివలెఁ గాంతిదూలఁగన ♦ భోమణితోఁచె వియత్పథంబునన్

చ. వనచరనాథుఁ డాత్తసుఖ ♦ వాంఛఁ దగుల్వడి మగ్నుఁ డైన భా
తిని దిమిరంబునన్ మునిఁగె ♦ దిక్సముదాయము లల్లనల్లనన్
గనఁబడసాగె దీపచయ ♦ కాంతులభంగిఁ దటిత్ప్రకాశముల్
వినఁబడె నెల్లవేళలను ♦ భేకరవంబులు వాపికాదులన్. 25

చ. "ఇనకిరణాళిచే రసము ♦ లెల్ల గ్రహింపుచు నష్టమాసముల్
దనయుదరంబున న్నిలిపి ♦ తద్దయుఁ గౌశలమొప్ప నంబరాం
గన ప్రసవించె నిప్పుడుద ♦ కంబులఁ బ్రేమ" ననంగ భూమిపై
ననయము వర్షముల్గురిసె ♦ నందము మీఱ ఫలించె వృక్షముల్

చ. జలధరగర్జనల్ సెలఁగె ♦ శైలములున్ జలియించు కైవడిన్
జలములఁ బ్రస్తరించెదివి, ♦ సాగరముల్, నదులున్ దటాకముల్
గొలఁకులుఁ జిన్నకాలువలుఁ ♦ గూలములుర్లఁగఁ బాఱె నేకమై
బలముగవీచె మారుతము ♦ పాడియుఁ బంటలునొప్పె ధాత్రిపై.

చ. హాలికులు హర్షమంద వసు♦ధాధిపులెల్లరు సంగరంబులన్
దలఁపక, దివ్యసౌధముల♦దారసుతాదులఁ గూడియుండ, నా
జలదచయంబుఁ గాంచి కడు♦సంతసమార మయూరబృందము
ల్సలలితనాట్యముల్సలుప♦సౌఖ్యకరంబుగ నేఁగె మాసముల్.

ఉ. వారిదముల్ శమింపఁగఁ బ్ర
భాకరుఁడొప్పె వియత్పథంబునన్
భూరిసుగంధసూనములు
భూజములం దలరారె నంతటన్
వైరులరాజ్యముల్ గెలుచు
వాంఛల నేఁగె నృపాలవర్గముల్
శ్రీరఘుపుంగవుండు గడు
శీఘ్రమునన్ బిలిపించె నర్కజున్.

తే. గీ. "భూవలయమెల్లఁ గ్రుమ్మరి ♦ భూతనూజ
జాడ నారసి, యొక్కమా ♦ సంబులోన
రం" డటంచును గపుల మా ♦ ర్తాండసూనుఁ
డంప నుత్సాహభరితులై ♦ యరిగి రపుడు. ౩౦

తే. గీ. హనుమదంగదజాంబవ ♦ దాదివీరు
లరయ దక్షిణదిశఁ గూర్చి ♦ యరుగఁ బూన
ననిలజున కిచ్చె నృపతి ర ♦ త్నాంగుళీయ
కంబు "నాతఁడె తీర్చుఁ గా ♦ ర్యంబు" ననుచు. 31

క. గిరులును, గుహలును, వనములు
పురములు, పల్లెలును, విజన ♦ భూముల నెల్లన్
దరుచరులు వెదకి వచ్చిరి
ధరణిసుతం గానలేక ♦ తరణిజుకడకున్. 32

సీ. పవనతనూజాది ♦ వానరుల్ దక్షిణ
భూభాగకానన ♦ ములును శైల
గుహలెల్ల గాలించి ♦ కోమలిజాడలఁ
గనుఁగొన నేరక, ♦ కడువిచార
మొందుచు వింధ్యాద్రి ♦ నుపవిష్టులై యుండఁ
బక్షివల్లభుఁడు సం ♦ పాతినాముఁ
డాజటాయువునన్న ♦ యరసి "ప్లవగులార !
యొకనాఁడు రావణుఁ ♦ డుర్వీసుతను

తే. గీ. గగనవీధిని గొంపోవఁ ♦ గాంత దుఃఖ
మునను "రామా" యనుచు నేఁగె ♦ దనుజపురికిఁ,
గంధి శతయోజనంబులుఁ ♦ గడతు రేని
ధరణిజను గాంతు"రని తెల్పెఁ ♦ దరుచరాళి. 33

తే. గీ. సంతసంబున నేఁగి యా ♦ శరధిచెంత
వరమహేంద్రాఖ్య నొప్పుప ♦ ర్వతము నెక్కి
"వనధి దాఁటంగఁ జాలిన ♦ వనచరుండు
పవనసూనుండె!" యనిరి యా ♦ ప్లవగు లెల్ల. 34

కం. యదుకులవార్ధి సుధాకర !
ముదితాత్మక ! దైత్యగర్వ ! ♦ మూలవిదళనా !
సదమల గుంటూరుపురీ
సదనా ! గోపాలబాల ! ♦ సజ్జనపాలా ! 35

—* గ ద్య ము *—

ఇది శ్రీమద్గుంటూరుపురఖేల వేణుగోపాల వరప్రసాదలబ్ధ
కవిత్వ శాండిల్యసగోత్ర మాచిరాజు సౌభాగ్యలక్ష్మ్యం
బికా సుబ్బరాయామాత్యతనూజ, కౌండిన్యసగోత్ర
దేచిరాజు శేషాంబారామచంద్రరాయతనూభవ
రామరాయాఖ్య ధర్మపత్నీ లక్ష్మీనరసమ్మ
నామ్నా విరచితం బైన శ్రీరామచరిత్రం
బను నిర్వచన కావ్యంబునఁ
గిష్కింధా కాండము.

శ్రీః

శ్రీమద్వేణుగోపాలస్వామినే నమః



# శ్రీరామచరిత్రము



## సుందరకాండము





రుక్మిణీసతీ హృ
త్సారస దిననాథ! విజిత ♦ దానవయూథా!
క్షీరాబ్ధి విహారా! మణి
హారా! నవనీతచోర! ♦ యఘ సంహారా! 1

క. తనమనమున రాముని పద
వనజంబులు నిలిపి మ్రొక్కి ♦ వాయుసుతుం డ
వ్వననిధిదాఁటఁగ నెగిరెను
ఘనబలదర్పములు మెఱయ ♦ గగనంబునకున్. 2

చ. దనుజులఘోర బాధలకుఁ♦దాళక, "కావు"మటంచు నే
న్మునులఁగృపామతిస్ననుచు♦మోదముతోనభయంబొసఁ
"జనకునివాక్యపాలనము ♦ సాకుగ వచ్చితి,మిమ్ముఁబ్రో
వనమున" కంచుఁబల్కుస్మిత♦వక్త్ర భజించెద నెల్ల వే

చ. కనకకురంగరూపమునఁ♦గాననసీమఁ జరించుదాన
జనకజ "పట్టితె"మ్మనుచు♦సంతసమార వచింపఁ బీరత
ధనువున బాణముఁ దొడిగి,♦దర్పమునన్ గుఱివెట్టు నా
మునిజనహర్షదు,న్భవన♦మోహనవిగ్రహునాత్మఁగొల్తు

చ. "అనయము యోగనిష్ఠులగు♦నార్యులకిచ్చుట సేవఁజేర
న్మనమున నీపదాబ్జములు♦మానక కొల్చుచు,దర్శనా
దినములఁబుచ్చుదాన;నిఁక♦దివ్యపదంబు నొసంగవే?" యం
చును వినుతించునాశబర ♦ సుందరినేలువిభుఁ భజించె

గీ. అనుచు నృపు నాత్మఁ బొగడుచు ♦ నాంజనేయుఁ
డనిలవేగంబుతో నమ్మ ♦ హాబ్ధిఁ గడచి,
ఘనసువేలాఖ్య నొప్పున ♦ గమున డిగ్గి
రాక్షసాధిపు లంకాపు ♦ రంబుఁ గాంచె.

చ. అనుపమరత్నదుర్గములు♦నంబరచుంబితగోపురంబు
ఘనమణిసౌధజాలములు♦గల్గి, "కుబేరునివాసమో! యీ
దనరుచు; దైత్యహర్షనిన ♦ దంబు లెసంగుపురోత్తమం
య్యనిలసుతుండుకన్గొని"ర♦యంబునబట్టణమేనుసొచ్చె

కం. "ననుఁ జూచిన నీరక్కసు
లనిసేయఁ గడంగిరేని ♦ నవనిజ నిచటన్

గనుఁగొనుట దుస్తరం"బని
మనమునఁ దా నిశ్చయించె ♦ మాపున వేడుకన్. 8

చ. అనిలతనూజు కార్యమున ♦ కడ్డముగాఁదగదంచు వేగఁదాఁ
జనెననఁ బశ్చిమాంబుధికిఁ ♦ జండకరుండరిగె న్దమోగుణం
బున నసురుల్నిమగ్నతను ♦ బొందిన భంగి సమస్తదిక్కులున్ టన్
మునిఁగెఁ దమంబునన్బవన ♦ పుత్త్రుఁడు సొచ్చెఁ బురంబు నంత

చ. తరుచరవీరుఁ డానిశిని ♦ ధారణిపుత్త్రిని జూడఁ బత్తనం
బరయు నెడన్ హిమాంశుఁ డుర ♦ యంబునఁ దోడ్పడఁ గోరుకై
సురుచిర కాంతులన్బఱపి ♦ శోభిలె నంబరవీధినా సుధావడిన్
శరుఁ గని యుత్పలంబులు వి ♦ కాసము నొందె సరోవరంబులన్

ఉ. రామనృపాలుకీర్తివలె ♦ రాజిలెఁ గౌముది సర్వదిక్కులన్
ప్రేమఁ జకోరముల్ గనుచుఁ ♦ దృప్తిగఁ గ్రోలె సుధాంశుజాల
భూమిని సౌధవృక్షముల ♦ పొల్పగు నీడలు నవ్యమందిరా ముల్
రామచయంబు భాతి నగ ♦ రంబునఁ బర్వె మనోహరంబుగన్.

తే. గీ. శైలచరవీరుఁ డంత మా ♦ ర్జాలమాత్ర
గాత్రుఁడై పురి సొరఁగ రా ♦ కాసి లంక
ద్వారమున నిల్చి పోరాడఁ ♦ బవనజుండు
ముష్టిఁ బొడువఁగ నది మ్రొక్కి ♦ పొమ్మనంగ. 12

ఉ. దారుణఖడ్గపాణులగు ♦ దైత్యభటాళి చరించు లంక న
వ్వీరుఁడు సొచ్చి, సౌధముల ♦ వీథుల, గాయకనాట్యశాలలన్
హారివనప్రదేశముల ♦ నంతిపురాల మహాసనంబులన్
భూరిధనాలయంబులను ♦ బుష్పకనామవిమానరాజమున్. 13

తే. గీ. సందుగొందులు గాలించి ♦ జనకతనయ
నెందుఁ గనలేక ఘనచింత ♦ నొంది హనుమ
"చంపెనో! సాధ్వి నీనిశా ♦ చరవిభుండు
దుఃఖమున మేను దొఱఁగెనో! ♦ తోయజాక్షి. 14

తే. గీ. బ్రిదికియుండిన నాకంటఁ ♦ బడకయున్నె ?
విభునికడ కేఁగి యేమని ♦ విన్నవింతు ?
వ్యర్థమయ్యె మదీయ ప్ర ♦ యత్న" మనుచు
సుందరాశోకవనమునఁ ♦ జొచ్చి, యచట. 15

సీ. చింతాభరమునఁ గృ ♦ శించి నిశాచర
కాంతలనడుమను ♦ గ్రాలుదాని,
ఘోరదైత్యాంగనా ♦ క్రూరభాషణముల
కనిశంబు నాత్మలో ♦ నడలుదాని,
మలినాంబరముఁ దాల్చి ♦ మహీవంకఁ జూచుచు
నొరుల వీక్షింపక ♦ యున్నదాని,
రామనామంబునే ♦ వేమఱుఁ దలఁచుచుఁ
గన్నీరు నించుచు ♦ నున్నదానిఁ,

ఆ. వె. గాంచి సంతసించెఁ ♦ గపివర్యుఁ డాసతి
"సీత"యనుచు నమ్మి ♦ చిత్తమందుఁ
దరుణిశోకపడుఁ బోవఁ ♦ దరుణము కాదని
వేఁచి కూరుచుండె ♦ వృక్షమునను. 16

సీ. రావణుం డానిశి ♦ రమణీయవేషుఁడై
కామినిఁ గనవచ్చి, ♦ కాంక్షమీఱఁ

బళికె నీరీతిని ♦ "భామ! నన్నొకమాఱు
మోమెత్తిచూడుము ♦ మోదమలరఁ
గాననంబునఁబడి ♦ కందమూలంబులఁ
గుడుచుమానవుని కై ♦ కుందనేల?
ఘనసముద్రము దాఁటి ♦ కాంత! నిన్ గనుఁగొన
వశముగా దతనికి ♦ వాంఛ వలదు

ఆ. వె. చింత వీడి నన్నుఁ ♦ జేపట్టు మిప్పుడే
రాణి నిన్నొనర్తు ♦ రాజ్యమునకు
భాగ్యమెల్ల నీది ♦ పద్మాక్షి ! నమ్ముము
రాము విడిచి రాజ్య ♦ రమను గొనుము. 17

తే. గీ. సురగరుడయక్షరాక్షస ♦ శూరవరుల
సమరమందు జయించితి ♦ నమరు లెపుడు
నూడిగము సేయుచుందు రో ♦ యువతి ! నాకు
నరుఁడు నను గెల్వనేరఁడు ♦ నమ్ము ! మదిని. 18

తే. గీ. రత్నభూషణములఁ దాల్చి ♦ రమ్యముగను
మణిరుచిరభాసురం బగు ♦ మందిరమున
దివిజకాంతాళి సేవింపఁ ♦ దేజరిలుచు
నన్నుఁగూడి సుఖింపుమో ♦ సన్నుతాంగి !" 19

చ. కలిమిఁ దపఃప్రభావమునఁ, గాంతిఁ బ్రచండపరాక్రమంబున
న్నలమునఁ, గీర్తి, విద్యలను ♦ గోమలి! రాముఁడు నాకు సాటియే
చలమును వీడి నన్గొనుము ♦ చయ్యనఁ గూర్తు సమస్తసౌఖ్యముల్
జలరుహనేత్ర! నీజనకు ♦ సర్వధనంబులఁ దేల్తు నమ్ముమా"!

తే. గీ. అనుచు నీచోక్తులను బల్క ♦ నాత్మ రోసి
ఖలుని వీక్షింప నొల్లక ♦ కాంచనాంగి
తృణముఁ జేఁబూని కనుచు, ని ♦ ర్భీత యగుచు
హితము బోధింప మది నెంచి ♦ యిట్టులనియె. 21

సీ. "దానవ ! నను నాఁడు ♦ దైత్యాంతకుఁడు లేని
సమయంబునను దెచ్చి, ♦ శౌర్యమెల్ల
నిచటఁ జూపెడి నిన్ను ♦ నెట్టి శూరుండనఁ
జెల్లు? నీ విఁకనైనఁ ♦ జెడుతలంపు
విడనాడి నను రామ ♦ విభున కొసంగుము
కాదేని తాఁడు సం ♦ గ్రామమందు
బాంధవయుతముగఁ ♦ బరిమార్చి నిను వేగ
నన్నుఁ గొంపోవును ♦ నమ్మ! మదిని

తే. గీ. రాఘవుల శౌర్య మెఱుఁగవే ♦ రావణుండ!
చిన్నతనమునఁ జంపఁడే ♦ భీమబలుల ?
నని వధింపఁడె మున్నఖ ♦ రాదిశూర
దనుజులను ? గాన నన్ను నా ♦ ధవున కిమ్ము. 22

తే. గీ. పట్టణంబును నిను శాప ♦ వహ్ని నిపుడె
దగ్ధ మొనరింపఁజాలనే ! ♦ ధారణీశు
విక్రమం బీవసుంధర ♦ వెలయుకోర్కి
నోర్తు నిబ్భంగి బాధల ♦ నో దురాత్మ ! 23

తే. గీ. నీ మహావైభవంబును ♦ నేను గోర
నిను దృణంబుగ భావింతు ♦ నిక్కముగను

ప్రాణమునఁ దీపి గలదేనిఁ ♦ బరసతులను
బాపవచనంబు లీరీతిఁ ♦ బలుకవలదు. 24

తే. గీ. అనుచు నిర్భయముగఁ బల్క ♦ నసురనాథుఁ
డాగ్రహోదగ్రుఁ డగుచు నా ♦ యవనిసుతను
సంహరింపఁగఁ జంద్రహా ♦ సంబు నెత్త
ధాన్యమాలిని వారించెఁ ♦ "దగ"దటంచు. 25

తే. గీ. "గడువు మాసద్వయం బిచ్చి ♦ కాంతు; మరల
ధిక్కరించిన నప్పుడు ♦ నిక్కముగను
దునుముదు" నటంచు వెడలె న ♦ ద్దనుజనాథుఁ
డంత దైత్యాంగనలు కుపి ♦ తాత్మ లగుచు. 26

క. "త్రిభువనసేవితు, దానవ
విభునిం జేపట్టి యిచట ♦ వివిధసుఖము లో
యిభయాన! పడయు మిఁక నీ
విభు నామము నెత్తవలదు; ♦ విను మా మాటల్.

తే. గీ. ఆకులలములు గుడుచుచు ♦ నడవిఁ దిరుఁగు
నల్పనరుని దలంప కీ ♦ యసురపతిని
బ్రీతిఁ గూడి సుఖంపు మో ♦ సీత! యిచట
రాక్షసాధిపు నిట్లు ని ♦ ర్లక్ష్యబుద్ధి. 28

తే. గీ. ధిక్కరించిన నిన్నిఁక ♦ నిక్కముగను
ఖండఖండములుగఁ గోసి, ♦ కాంక్ష దీఱ
భక్షణ మొనర్తు" మనుచును ♦ బలువిధముల
దైత్యకాంతలు బెదరింప ♦ ధరణిజాత. 29

ఆ. వె. "భాగ్యవంతుఁడైన ♦ భాగ్యహీనుండైనఁ
బతినివిడువఁదగదు ♦ సతుల కెపుడు
ధర్మముఁ ద్యజించి, ♦ ధనమున కాసించి,
బ్రదుకనొల్ల! దనుజ ♦ భామలార! 30

తే. గీ. ఇచ్చవచ్చినరీతి న ♦ న్నెల్లరిచట
భక్షణమొనర్పుఁ"డనఁగ న ♦ ప్పరమసాధ్వి,
భీషణార్భటు లొనరించి, ♦ పిదప, రాక్ష
సాంగనలు నిదురింప ధ ♦ రాత్మజాత. 31

ఉ. "అక్కట! ప్రాణనాథుఁడు కృ ♦ పాళుఁడు నేఁగనరామికిన్నదుఁ
బొక్కుచు నేమహాగహన ♦ భూములఁ గ్రుమ్మరువాఁడొ; నీసతిఁ
మ్రుక్కడిరావణాసురుఁడు ♦ మోసమునఁ గొనిపోయె లంకకుఁ
గ్రక్కునఁ బోయి కావు"మనఁ ♦ గల్గినసజ్జను లేరు లేరొకో! 32

ఉ. శూరుఁడు పక్షివర్యుఁడు వ ♦ సుంధరఁ గూలెఁగటా! మదర్థమా
ధీరుఁడు ప్రాణనాథునకుఁ ♦ దెల్పకమున్నె దివంబు నొందెనో!
శ్రీరఘురాముఁడాకపులఁ ♦ జేరఁడొ! విన్నను జాగు సేయునే?
క్రూరనిశాచరాళి నిలఁ ♦ గూల్చి, కృప న్ననుఁ బ్రోవకుండునే!

చ. ఘనతరశోకతాపమునఁ ♦ గాంచిరొ! స్వర్గము రామలక్ష్మణు
ల్దనుజవిభుండు మోసమున ♦ దైత్యులచే సమయింపఁ జేసెనో!
వనజదళాయతాక్షుఁగను ♦ భాగ్యము నాకిఁకఁ గల్గదక్కటా
వనుజజుఁ డిట్లు నానుదుట ♦ వ్రాసినవ్రాలిది దాఁట శక్యమే?

ఉ. హా! రఘురామచంద్ర! సుగు ♦ ణాకర! దీనజనార్తిసంహరా!
శూరవరాగ్రగణ్య! రిపు ♦ సూదన! నేననయంబు నివ్విధిఁ

క్రూరనిశాచరార్భటులఁ ♦ గుందుచు నెతనొందుట నీ వెఱుంగవో!
కూరిమి లేదొ! నాయెడలఁ ♦ గోసలవల్లభ! రావదేలకో!

ఉ. ఎక్కడి దండకాఖ్యవన? ♦ మెక్కడి లంక? మదీయనాథుఁ డిం
కెక్కడ? యిమ్మహాజలధి ♦ నెవ్విధి దాఁటుదు రన్నదమ్ము? లే
దిక్కును లేదు మృత్యువయ ♦ దిక్కనుచున్ బరితాప మొందుచున్
మ్రొక్కుచు రామచంద్రునకు ♦ భూసుత వీడఁదలంచెఁ బ్రాణముల్

చ. తరుచరవర్యుఁ డత్తఱిని ♦ ధారణిపుత్రినిఁ జేరి మ్రొక్కి, భూ
వరులచరిత్రముం దెలుపఁ ♦ బంకజలోచన సంశయింపఁగా
నరవరు రత్నముద్రికను ♦ నమ్మిక మొంద నొసంగ దాని నా
ధరణిజ నేత్రపద్మములఁ ♦ దాల్చి, ప్రియంబునఁ బల్కెనిట్టులన్.

సీ. "పవనతనూజ! వీ ♦ రవరేణ్య! గుణగణ్య!
ప్రాణముల్ నిలిచె నీ ♦ రాకవలన
క్షేమమా! శ్రీరఘు ♦ రామలక్ష్మణులకుఁ
దలఁచునా! యెప్పుడైన ♦ ధవుఁడు నన్ను
మఱచెనో! కృపవీడి ♦ మానసంబున" నంచు
జెలజెలఁ గనుల బా ♦ ష్పములు గురియ
శోకింప, మారుత ♦ సూనుఁ డూరార్చుచుఁ
"బ్రియసఖివినాదిరాపై ♦ భదప్రియాశులు

తే. గీ. కుశలులై యున్నవారలు ♦ కుపలయాక్షిఁ
డమ్మ! నిన్నె స్మరించు దుః ♦ ఖాబ్ధి మునిఁగి,
తరుచరులఁ బంపె నీజాడ ♦ నరయు కొఱకు
వనధి లంఘించి నేనిటు ♦ వచ్చినాఁడ." 38

సీ. అని వివరింప న ♦ య్యవనీతనూజాత
హర్షశోకంబుల ♦ నతనిఁ గాంచి,
"పవననందన! నీవు ♦ పరమాప్తుఁడవు మాకు
నాయవస్థల రఘు ♦ నాయకునకు
విశదంబుగాఁ దెల్పి ♦ వేగ నిం దరుదెంచి
పురము నరాక్షసం ♦ బుగ నొనర్చి
కూరిమి నన్నుఁ గై ♦ కొనిపొమ్మనుచుఁ దెల్పు
మమ్మహాత్మునిచర ♦ ణాబ్జయుగము

తే. గీ. భక్తి ననయంబుఁ దలఁచుచు ♦ బ్రదికియున్న
దాన నీక్రూరదైత్యబా ♦ ధల సహించి;
రెండుమాసము లుందు నీ ♦ రీతి నిచట
నంత నను సంహరింతు రీ ♦ యసురు లనుము. 39

చ. మనమున రాముఁ దండ్రిగను, ♦ మాతగ నన్నుఁ దలం
చుచున్ మహా
వినయమునన్ సదాఁ గొలుచు ♦ విశ్రుతకీర్తిసుమిత్రిసూతినా
ఘనకలుషోక్తికిన్ వ్యధిత ♦ డిన్ గనుఁ గొంటి ఫలంబు నంచు నో
హనుమ! వచించి యాఘనుఁడ ♦ యన్ననుఁ బ్రోవఁగ రమ్మనంగదే!"

తే. గీ. అనుచు దుఃఖింపఁ బలికె న ♦ య్యనిలసుతుఁడు
తల్లి! నీవంత దనుకను ♦ దడయ నేల?
నాభుజముల నధిష్ఠింపు! ♦ నాథుకడకు
శీఘ్రముగ నిన్నుఁ గొంపోదుఁ ♦ జింత యేల?
నసురు లెదిరింప భంజింతు ♦ నాహవమున." 41

తే. గీ. అనఁగ వైదేహి హర్షించి ♦ "యనిలతనయ !
నీవు తగుదువు గొనిపోవ ♦ నిక్కువముగ
నైన రఘుకుంజరుఁడె వచ్చి ♦ యసురకోట్ల
సమరమునఁ దుంచి, ననుఁ గొని ♦ చనుట మేలు.

తే. గీ. రామభూవరుశౌర్య మీ ♦ భూమి నెపుడు
ఖ్యాతినొందఁగవలయునో ♦ కపివరేణ్య !
అదియుఁగాక నే నన్యుని ♦ నంట నొల్ల ;
మాతృభావంబె నీదైన ♦ మాన్యచరిత ! 43

తే. గీ. అసురుఁ డానాఁడు మూర్ఛిత ♦ నైన నన్ను
బలిమిఁ దోడ్తెచ్చె నిచటికిఁ ♦ బ్లవగవర్య !
అబల నసహాయనైన నే ♦ నతని నేమి
సేయఁజాలుదు? నీవె యో ♦ జింపు" మనుచు
మనుజపతి కీయ నిజశిరో ♦ మణి నొసంగె. 44

క. "వనచరసైన్యంబులతో
జననాథుఁడు వేగ వచ్చి ♦ శౌర్యం బొప్పన్
దనుజులఁ బొరిగొని ప్రేమను
గొనిపోవును జనని ! నిన్నుఁ ♦ గోరికతీఱన్." 45

తే. గీ. అనుచు నూరార్చి వందన ♦ మాచరించి
జనకనందనసెలవుఁ గై ♦ కొనుచు వెడలి
రావణుని జూడనెంచి, వి ♦ క్రమము దనర
ధ్వంస మొనరింపఁబూనె ను ♦ ద్యానవితతి. 46

సీ. చండమదోద్దండ ♦ శుండాలమో ! యనఁ
గమలాకరంబులఁ ♦ గలఁచివైచి,

సుందరసుమగుచ్ఛ ♦ సందోహములఁ దుంచి,
కోమలకుంజముల్ ♦ కూలఁద్రోచి,
ఫలభరితోన్నత ♦ పాదపంబులఁ గూల్చి
ప్రాసాదశిఖరముల్ ♦ పగులఁగొట్టి,
క్రీడాచలంబుల ♦ క్షితిసమంబుగఁ జేసి,
కోలాహలమున ది ♦ క్కులు నదల్చి,
తే. గీ. విశ్వభీకరలీలఁ గా ♦ వింప నపుడు
రాక్షసాంగన లది గాంచి ♦ రావణునకుఁ
దెలుప రక్తాక్షుఁడై పంపె ♦ దితిసుతాళి
నుగ్రకర్ముల నక్కపి ♦ నిగ్రహింప. 47

సీ. కాలకింకర సమ ♦ కాయు లెన్బదివేల
దైత్యులు శూలము ♦ ద్గరగదాది
సాధనంబులనైవ ♦ సామీరి తోరణ
నిక్షిప్తపరిఘచే ♦ రాక్షసులను
మోదుచుఁ బటుశక్తిఁ ♦ బుడమిపైఁ గూల్పఁగ
వనపాలకశతంబు ♦ భండనమున
కరుదేర నెల్లర ♦ హతులను గావించి
తనరారు తోరణ ♦ స్తంభ మెక్కె ;
తే. గీ. జయము ! కోసల శ్రీరామ ♦ చంద్రపతికి ;
జయము ! సద్గుణగణయశ ♦ శ్శౌర్యనిధికి ;
జయము ! రిపుమర్దనుండు ల ♦ క్ష్మణవిభునకు
జయము ! రవిపుత్త్రునకుఁ, గపీ ♦ శ్వరున కనుచు.

సీ. జయ జయ ధ్వానముల్ ♦ సలుపుచు "నే మరు
త్తనయుండ ! రాక్షస ♦ సూదనుండ !
దాసుఁడ రఘురామ ♦ ధారణీశున" కంచు
గర్జించుచున్న యు ♦ క్కపివరేణ్యుఁ
'బట్టి తెం'డంచు రా ♦ వణుఁ డంపె నుగ్రుఁడై
సచివపుత్త్రుల వీర ♦ సప్తకమును,
సైన్యాధిపతులను, ♦ జంబుమాలిని, శూరు
నక్షకుమారు ని ♦ జాత్మజన్ము,
తే. గీ. నంతవా రెల్లరును సమ ♦ స్తాయుధములఁ
బూని యరుదెంచి, క్రుద్ధులై ♦ పోరు సలుప
వాలమునఁ, దీవ్రముష్టులఁ ♦ బాదపముల
మోది, వారలఁ బరిమార్చె ♦ భూరిబలుఁడు. 49

చ. దనుజకులేంద్రనందనుఁడు ♦ దారుణశాతశిలీముఖాళిచే
ననిలజుఁ గప్ప, నాతఁ డసుర ♦ యంబున దేహముఁ బెంచి, పన్నగా
శనునికి యన్నభంబునవి ♦ శంకటలీలఁ జరించుచున్ సురల్
వినుతినొనర్పఁ ద్రుంచెఁ బటు ♦ విక్రమ మొప్ప సురారి బాణముల్

క. గిరగిరఁ దిరుగుచు దారుణ
శరకాండముఁ ద్రుంచుగగన ♦ చరుఁ గపివీరున్
సరసీజభవాస్త్రంబున
ధర వడఁకఁగ నింద్రజిత్తు ♦ దగ్రతఁ బట్టెన్. 51

తే. గీ. అంత నక్కపికుంజరు ♦ నసురభటులు
కొలువుకూటంబునకుఁ దెచ్చి, ♦ నిలువఁబెట్టఁ

గోత్రధరక్త్రాత్ముఁడగుచు ర ♦ క్షోవిభుండు
పవననందనుఁ గనుఁగొని ♦ పలికె నిట్లు. 52

కం. "వనచర ! ని న్నెవఁ డంపెను?
వననిధి లంఘించి వచ్చి ♦ భయ మించుకయున్
మనమున నొందక దానవ
ఘనపాలితపురము సొరఁగఁ ♦ గత మెద్ది?" యనన్.

ఉ. రామనృపాలుసేవకుఁడ; ♦ రావణ! నే ననిలాత్మజుండఁ ద
త్స్వామినిఁ గానవచ్చితిని ♦ పార్థివునాజ్ఞను; నిన్నుఁ జూడఁగా
నేమదిఁ గోరి యిత్తఱిని ♦ నీసుతునస్త్రముచేతఁ జిక్కితిన్
'భూమిజఁ గోసలేశునకుఁ ♦ బొందుగ ని'మ్మని చెప్పవచ్చితిన్.

సీ. ధర్మజ్ఞుఁడవు తపో ♦ ధనుఁడవు నీ విట్లు
పరమసాధ్విని జెఱ ♦ పట్టఁదగునె ?
క్ష్మాసుతన్ సామాన్య ♦ కాంతఁగ నెంచితే
నీ పాలిమృత్యువే ♦ యాపడంతి
అర్కకులేశుకా ♦ ర్యంబు నెఱుంగవే
యజ్ఞసంభవశంక ♦ రాదులైన
నాహవంబున నమ్మ ♦ హామహుం గెలువఁగఁ
జాలరు నమ్ముని ♦ శాచరేంద్ర !

తే. గీ. చెఱుతలంపును విడనాడి, ♦ సీత నిచ్చి
శరణుఁ జొచ్చినఁ బ్రోచు ని ♦ క్ష్వాకుకులుఁడు,
నీచమతివౌచు విభవంబు ♦ నేలఁ గూల్చు
కొనకు ! చెడకుము ! నామాట ♦ వినుము ! వినుము!"

సీ. అని యుపదేశింప ♦ నసురేశుఁ డుగ్రుఁడై
"యిచ్చవచ్చినరీతి ♦ నిచటఁ బ్రేలు
మర్కటాధము నిట ♦ మట్టుపెట్టుం" డన
"దూతను జంపుట ♦ నీతిగాదు
చిత్తంబునకుఁ దోఁచు ♦ శిక్ష విధింపుమీ!"
వనియె విభీషణుం ♦ డంత నాతఁ
డనలముం దోఁకకు ♦ నంటించి విడువ నా
జ్ఞాపించె నపుడు దా ♦ నవులు వేగ

తే. గీ. తైలవస్త్రంబులను జుట్టి ♦ వాలమునకు
వహ్ని నంటింప మనమున ♦ వాయుసూనుఁ
డనలదేవుని బ్రార్థింప ♦ నగ్నిశిఖలు
చల్లనై తోఁచె; నంత ర ♦ క్షకభటులను. 56

సీ. పరిఘుచేఁ బరిమార్చి, ♦ ప్రళయకాలాగ్నిని
బోలు వాలానల ♦ జ్వాల లెగయ
నింటింటి కెగిరి దై ♦ త్యేంద్రు నాగారంబు
లసురగేహముల హు ♦ తాశనునకు
నశనంబుఁ గావించె ; ♦ నార్తనాదంబులుఁ,
బటపటధ్వానముల్ ♦ వహ్నిశిఖలు
ధూమముల్ మిన్నంట, ♦ ధూర్జటి త్రిపురముల్
భస్మం బొనర్చిన ♦ పగిది లంక

తే. గీ. దగ్ధమొనరించి శౌర్యంబు ♦ దనర నంత
నబ్ధి వాలాగ్నిఁ జల్లార్చి, ♦ యవనిసుతకుఁ

కుశలవార్త నెఱింగించి; ♦ కోర్కి మీఱఁ
గంధి లంఘించి చనియె శీ ♦ ఘ్రముగ హనుమ. 57

తే. గీ. వనధి తీరమునం దున్న ♦ వానరులకు
సకల మెఱిఁగించి వారితో ♦ సత్వరముగ
భూవరుల సన్నిధికిఁ బోయి ♦ మోద మలరఁ
జరణముల వ్రాలి, వివరించె ♦ సర్వ మిట్లు. 58

ఆ. వె. "కంటి, నియత సీతఁ ♦ గంధి లంఘించి, యా
దనుజగణము లెల్లఁ ♦ దల్లడిల్ల
లంకఁ గాల్చివైచి ♦ లలనశిరోమణిఁ
దెచ్చినాఁడ" ననుచు ♦ నిచ్చెఁ బతికి. 59

కం. జనకజ యంపినరత్నముఁ
గనుఁగొని కాకుత్స్థవరులు ♦ కడు దుఃఖితులై
వనచరశేఖరుఁ బొగడిరి
జననాథుఁడు కౌఁగిలించె ♦ సరగున హనుమన్.

ఉత్సాహ. అనిలతనయ! గోష్పదంబు♦నట్టు లబ్ధిదాఁటి, యా
జనకతనయ నరసి, దేవ ♦ శత్రుఁ గాంచి, జంకకే
దనుజవరులఁ గూల్చి, లంక ♦ దగ్ధమున్ బొనర్చితే
ఘనబలాఢ్య! నీకు సాటిఁ ♦ గాన నీ జగంబునన్.

తే. గీ. రామవిభుఁ డట్లు పొగడ న ♦ ర్కజుఁ డఱువది
కోట్లసైన్యాధిపతులను ♦ గూర్చి కీశ
వాహిని నసంఖ్యముగఁ జేర్చి ♦ వసుధ నిండఁ ;
బ్రభువులకుఁ దెల్ప ముదమునఁ ♦ బయనమైరి.

తే. గీ. శంఖ భేరీ మృదంగ ఘో ♦ షంబు లెసఁగ
వానరానీక హార్షర ♦ వంబు లలర
శత్రుభంజనోత్సాహులై ♦ శౌర్యధనులు
చనిరి రత్నాకరముఁ జేర ♦ సత్వరముగ. 63

తే. గీ. వేలఁ దాళతమాల వ ♦ నాళి తనర
శైలపావక నవరత్న ♦ జలచరముల
గర్భమునఁ దాల్చి, ఘనతరం ♦ గంబు లొప్ప
నంబుదధ్వని నెసఁగు మ ♦ హాబ్ధి సార్ధ
దినమునం జేరి విడిసిరి ♦ దివ్యయశులు. 64

క. బృందారణ్యవిహారా!
నందుని ముద్దులకుమార! ♦ నవనీతహరా!
కందర్పకోటిసుందర!
మందరధర! మేరుధీర! ♦ మధుసంహారా! 65

—* గద్యము *—

ఇది శ్రీమద్గుంటూరుపుర ఖేల వేణుగోపాల వరప్రసాదలబ్ధ
కవిత్వ శాండిల్యసగోత్ర మాచిరాజు సౌభాగ్యలక్ష్మ్యాం
బికా సుబ్బరాయామాత్యతనూజ, కౌండిన్యసగోత్ర
చేచిరాజు శేషాంబా రామచంద్రరాయతనూభవ
రామరాయాఖ్య ధర్మపత్నీ లక్ష్మీనరసమ్మ
నామ్నా విరచితం బైన శ్రీరామచరిత్రం
బనునిర్వచనకావ్యంబునఁ
సుందరకాండము.

శ్రీః

శ్రీమద్వేణుగోపాలస్వామినే నమః



# శ్రీరామచరిత్రము



## యుద్ధకాండము





మానసమణిచోరా !
కామితమందార! భక్త ♦ కలుషవిదారా !
భూమీభరసంహారా !
కోమలహరినీలగాత్ర! ♦ కువలయనేత్రా !-

సీ. భానుకులోత్తముల్ ♦ భానునందనుఁ గూడి
వనచరసేనతో ♦ వనధికడకు
వచ్చి విడిసి రని ♦ వార్తాహరులు చెప్ప
దనుజేశుఁ డాలించి ♦ తన సచివుల.

"నేమిసేయందగు ♦ నిపు?" డన వారలు
"శౌర్యంబు దీపింప ♦ సంగరమున
శాఖామృగచరులఁ జ ♦ క్కాడి యమ్మనుజుల
భువిఁ గూల్చి, నీ కతి ♦ ముదముఁగూర్తు

తే. గీ. మింక నొండుగ యోజింప ♦ నేల? మనము
త్రిభువనంబులు గెలిచియు ♦ దేవ! యిప్పు
డల్పనరునకు నమ్మర్క ♦ టాధములకు
వెఱపు నొందఁగ నేల? యో ♦ వీరవర్య? 2

తే. గీ. తరుణి సమ్మతమున కిట్లు ♦ తడయ నేల?
బలిమిఁ జేపట్టి సౌఖ్యంబుఁ ♦ బడయు మధిప!
పిదప నేమైన నగుఁగాక ♦ భీతి యేల!"
యనుచు దుర్బుద్ధిఁ గఱప న ♦ య్యసురవిభుఁడు. 3

తే. గీ. "బలిమి ము న్నొకనిర్జర ♦ భామఁ గలియ
నజుఁడు నన్ను శపించెఁ గ్రో ♦ ధాతిశయత
'నిన్నుఁ గోరనికాంత నిం ♦ కెన్నఁడైనఁ
జేర శకలంబు లగు నీదు ♦ శిరము' లనుచు
జంకుదును దాన" నన విభీ ♦ షణుఁడు పలికె. 4

సీ. "అన్న! వీరలమాట ♦ లనుచితంబులు గాన
మెచ్చవలదు, వీని ♦ మిత్రకులజుఁ
డలఘుపరాక్రముఁడౌ ♦ నతనితో వైరముఁ
బూనిన భండన ♦ భూమి నిన్ను
బాంధవయుతముగఁ ♦ బరిమార్చు నిది నమ్మ,
వైరంబు వీడి, య ♦ వ్వనిత నిచ్చి

శరణుఁ జొచ్చుట మేలు ♦ జానకీనాథుండు
కరుణాపయోరాశి ♦ కాచు నిన్ను

తే. గీ. వినుము నామాట" లన దైత్య ♦ విభుఁ డనుజుని
గోపమునఁ జూచి "నావైరి ♦ గుణబలముల
నెల్లవేళలఁ బొగడుచు ♦ నుల్లమునకు
వెగటుఁ గలిగింతు వటుగాన ♦ వెడలు" మనఁగ
గగనపథమున వచ్చి భూ ♦ కాంతుఁ గాంచి. 5

మత్త. క్రూర దానవగర్వభంజన! ♦ కోసలక్షితిరంజనా!
వారిజాప్తతనూజపోషణ! ♦ వాలిదర్పవిశోషణా!
వారిజాసనఫాలలోచన ♦ వాసవామరతోషణా!
సారసేక్షణ! సత్యభాషణ! ♦ చారుకీర్తివిభూషణా!

చ. శరణని వేఁడువాఁడ నిను♦సాధుజనావన! పాపభంజనా!
తరణికులోత్తమా! వినుము♦దానవనాథుని సోదరుండ; న
ద్ధరణిజ నీకొసంగుమని♦దైత్యున కించుక నీతిఁ జెప్పఁగన్
వరగుణసాంద్ర! నన్నతఁడు♦వైరమునన్విడనాడెఁగా నృపా!

క. అని ప్రార్థించిన నచ్చటి
వనచరు లెల్లరును "వైరి ♦ పక్షమువారిన్
మన మిపుడు నమ్మరా"దన
జననాథుం డిట్టు లనియె ♦ శాంతాత్ముండై. 8

కం. శరణాగతరక్షణమే
పరమం బగుధర్మ మనుచు ♦ భావింతు; నిశా

చరవల్లభుఁడైనను నను
"శర"ణన రక్షింతుఁగాన ♦ సంశయ మేలా ? 9

తే. గీ. అనుచుఁ గరుణార్ద్రవీక్షణ ♦ నతనిఁ జూచి
"సమరభూమిని రావణు ♦ సంహరించి
ప్రభుని గావింతు ని"న్నని ♦ యభయమొసఁగి
భీతిఁబాపెను నృపతి వి ♦ భీషణునకు. 10

తే. గీ. యోజనశతంబువైశాల్య ♦ మొప్పుచున్న
జలధి దాఁటునుపాయంబుఁ ♦ దెలియఁగోరి
దర్భశయనుఁడై శ్రీరామ ♦ ధరణినాథుఁ
డంబుధిని వేఁడె మూఁడునా ♦ ళ్ళమలభక్తి. 11

సీ. వారాశి యేమియుఁ ♦ బ్రత్యుత్తరము సేయ
కున్న నారఘువీరుఁ ♦ డుగ్రుఁడగుచు
"న న్నలక్ష్యముసేయు ♦ నిన్ను బాణాగ్నిచే
నింకింతుఁ;గనుఁగొను ♦ మిప్పు"డనుచు
నొక్కశరము నేయ ♦ నుదధి కల్లోలంబు
నొంది, నరాకృతి ♦ నుర్విధవుని
క్షమియింపుమని వేఁడి, ♦ "కపిముఖ్యు నలునిచే
సేతువు నిర్మించి, ♦ శీఘ్రముగను

తే. గీ. శత్రుమర్దన మొనరింపు ♦ జానకీశ !"
యనుచు వందనమొనరించి, ♦ యమ్మహాను
భావుకరుణను గైకొని ♦ వనధి చనియె
నంతఁ గపులెల్ల రుత్సాహ ♦ వంతు లగుచు. 12

క. ధరణిని గల శైలంబులుఁ
దరువులుఁ బెకలించి తెచ్చి ♦ దర్పము వెలయన్
శరధిని వైచుచునుండఁగఁ
దరుచరవర్యుండు నలుఁడు ♦ దారిని గట్టెన్. 13

తే. గీ. అమ్మహాబ్ధికి సేతువు ♦ నైదు దినము
లందు నిర్మింపఁ గడచి పై ♦ న్యాళితోడఁ
బట్టణము సేరి పతి రాయ ♦ బార మంప
నసురవిభు డాసి తెలిపె ని ♦ ట్లంగదుండు. 14

ఉ. "రావణ! నాఁడు భూసుతను ♦ రాజసవృత్తిని గాక దొంగవై
నీవు హరింప, శౌర్యమున ♦ నే నని సేయఁగ నెత్తివచ్చితిన్
గావున బుద్ధిఁ దెచ్చుకొని, ♦ కావరమున్ విడనాడి, మైథిలిన్
బావనశీల నా కొసఁగి ♦ పాపముఁ గావ నమస్కరింపుమా!"

ఉ. జానకినీయవేని యిఁక ♦ శౌర్యముఁ జూపుము వచ్చి చెచ్చెరన్
మానక నాశరాగ్నుల న ♦ మాత్యతనూజహితానుజాళితో
దానవ! నిన్ను యుద్ధమున ♦ దగ్ధము సేసి, మదీయభక్తు, సు
జ్ఞాననిధిన్ విభీషణు ని ♦ శాచరవల్లభుఁ గా నొనర్చెదన్."

తే. గీ. అనఁగ విని దైత్యవల్లభుఁ ♦ డాగ్రహమునఁ
బ్రళయకాలానలునిరీతి ♦ భగ్గు మనుచు
"నంత మొందింపుఁ డివ్వాన ♦ రాధము" నని
యాజ్ఞ నొసఁగంగ వేవేగ ♦ నంగదుండు. 17

తే. గీ. దనుజగణముల నుఱుమాడి ♦ ధరణినాథు
కడకు నరుదెంచి తెలిపె ర ♦ క్కసుని చర్య

రాఘవేశ్వరుఁ డది విని ♦ రౌద్రుఁ డగుచుఁ
దరుచరుల కాజ్ఞ నొసఁగె యు ♦ ద్ధమున కపుడు. 18

సీ. వానరు లుత్సాహ ♦ వంతులై ముట్టడి
వైవ నిశాచరుల్ ♦ భండనమున
కరుదేరఁ బోరాట ♦ మయ్యె ఘోరంబుగ
వనచర దానవ ♦ వాహినులకు
భేరీ మృదంగ శం ♦ ఖారవంబులు రథ
నేమిధ్వనుల్ శింజి ♦ నీస్వనంబు
లిభబృంహితము లశ్వ ♦ హేషానినాదముల్
భటగర్జనలు వీర ♦ భాషణములు

తే. గీ. జయజయధ్వానము లెసంగఁ ♦ జాపశూల
ముసలతోమర పట్టిస ♦ ముద్గరాది
సాధనంబుల దైత్యులు ♦ శైలపాద
పములఁ గపులును సల్పిరి ♦ ప్రధన కేళి. 19

తే. గీ. రథతురంగఖురోద్ధూత ♦ రజము భాను
బింబమును గప్పఁ, జీఁకటి ♦ భీకరముగఁ
గ్రూరమానసములఁ దమో ♦ గుణముభంగి
నలమె దిక్కుల నొండొరుల్ ♦ దెలియనటుల. 20

తే. గీ. నారి మీటుట, వింట బా ♦ ణంబు నిడుట
గురిని జూచుట, విడచుట, ♦ గోచరంబు
కాని తెఱఁగున హస్తలా ♦ ఘవము దనర
శరములను గురిపించుచు ♦ ఊర్మిధవుండు. 21

తే. గీ. శరధిఁ ద్రచ్చెడిమందరా ♦ చలముభంగి
నసురవాహినిఁ జెండాడె ♦ నద్భుతముగ
వినఁబడును జ్యారవం బొండె ♦ భీకరముగఁ
గానఁబడు భువిఁ దొరలుర ♦ క్కసులతలలె. 22

తే. గీ. ఒక్కశరమును గుఱి సెడి ♦ యుర్విఁబడక
దైత్యశిరములఁ ద్రుంచుచు, ♦ ధరణి శోణ
వాహినిని బాఱఁజేయుచుఁ ♦ బద్మమిత్రుఁ
గ్రమ్మురజము నడఁచి తిమి ♦ రంబుఁ బాపె. 23

తే. గీ. కరితురగదైత్యకపికళే ♦ బరచయంబు
జలములఁ జరించుఘనతిమిం ♦ గిలము లనఁగఁ
దలలుఁదనరారఁ జిత్రమ ♦ త్స్యములభంగి
శోణితాంబుధి యన రణ ♦ క్షోణి యొప్పె. 24

ఉ. భానుకులప్రదీపకుల ♦ బాణదవానలఘోరకీలలన్
దానవకీటకోత్కరము♦దగ్ధమునొందఁగ, మేఘనాదుఁ డా
"మానవులన్ వలీముఖుల♦మర్దనఁజేయుదు" నంచునుగ్రుఁడై
పూని శరాసనంబు రణ♦భూమికి వచ్చె రథాధిరూఢుఁడై.

చ. తరుచరవీరుఁ డంగదుఁడు♦దర్పమెలర్పఁగ వానితోడ సం
గరమొనరించిసూతుఁదుర♦గంబులధారణిఁగూల్చ, నాతఁడం
బరమున మేఘజాలముల ♦ బ్రహ్మవరంబున డాగి యానిశిన్
దురమొనరించెఘోరముగఁ♦దూలఁబ్లవంగవరేణ్యులెల్లరున్

క. పొలయించి కపిగణంబుల
జలజాప్తాన్వయులఁ బట్టె ♦ సర్పాస్త్రంబున్

జలమొప్ప విడిచె దైత్యుఁడు
పలుదెసల విషాగ్నిశిఖలు ♦ పర్వ రయమునన్. 27

తే. గీ. అజునివాక్యంబు మన్నింప ♦ నాత్మఁదలఁచి
ఘోరనాగాస్త్రబద్ధులై ♦ శూరవరులు
రక్తసిక్తాంగులై ధర ♦ వ్రాలి రపుడు
పుష్పితాశోకము లనంగఁ, ♦ బొగలఁ గపులు. 28

క. సంతసమునఁ బుత్త్రుఁడు దివి
జాంతకు సన్నిధికిఁ జని జ ♦ యంబును దెలుపన్
సంతోషించె మనంబున
నంతట ఘనబలుఁడు పన్న ♦ గాశనుఁడు వడిన్. 29

తే. గీ. భూరిపన్నగబద్ధులై ♦ పుడమి వ్రాలి
కపివరేణ్యులు కాపాడఁ ♦ గాంతిఁ దూలి
యున్న రవికులతిలకుల ♦ సన్నిధాన
మునకుఁ జనుదెంచి భంజించె ♦ భుజగములను. 30

ఆ. వె. భానుకులజు లపుడు ♦ బంధవిముక్తులై
మూర్ఛఁ దేఱి, పరమ ♦ మోద మొంది
వైనతేయుఁ గాంచి ♦ వందన మొనరించి
'యనఘ! మమ్ముఁ గాచి' ♦ తనుచుఁ బొగడ.

క. గరుడుఁడు సంప్రీతుండై
తరణికులోత్తముల సెలవుఁ ♦ దాఁ గొని చనియెన్
దరుచరులు హర్ష మొందిరి,
ధరణీశుల కుశలముఁ గని ♦ దైత్యగణంబుల్. 32

సీ. తల్లడ మందుచు ♦ ధనువులతో శర
వర్షంబుఁ గురియింపఁ ♦ బర్వతములు
భూరుహంబులుఁ గొని ♦ మోఁదుచు రణమున
నసురులఁ దెగటార్చి ♦ రద్రిచరులు
రామలక్ష్మణుల శ ♦ రంబులచే భువిఁ
గూలె నిశాచర ♦ కోటి యపుడు
ధూమ్రాక్షునాముని ♦ దునిమె గాడ్పుపట్టి
వజ్రదంష్ట్రుని ద్రుంచె ♦ వాలిసూనుఁ
తే. గీ. డతిబలు నకంపనుని జంపె ♦ ననిలసుతుఁడు
నీలుఁడు ప్రహస్తనాముని ♦ నేలఁ గూల్చె
నడఁచెఁ గుంభుని రవిజుఁ డి ♦ ట్లగచరాళి
రక్కసుల నుక్కడంచెను ♦ లెక్కమీఱ. 33

తే. గీ. అంత నాగ్రహుఁ డగుచు ద ♦ శాననుండు
వేత్రహస్తులు వినుతింప ♦ వెడలి, భీమ
భండనం బొనరించుచు ♦ వానరాళి
నుక్కడంప రఘూత్తముం ♦ డుగ్రుఁ డగుచు. 34

చ. అరదము గూల్చి, సూతుని హ ♦ యంబులఁ ద్రుంచి, కిరీట ఛత్రముల్
ధరఁబడవైచి, యాయుధవి ♦ తానముఁ జూర్ణముఁ జేసి, ఘోరని
ష్ఠురసితతుల్యవక్షము ని ♦ షుప్రకరంబుల గాడనేయఁ, గా
తరతఁ జలించుచున్ధనువు ♦ ధారణివైచె దశాస్యుఁ డయ్యెడన్.

చ. జనపతి యుద్ధధర్మమున ♦ శాత్రవుఁ గాంచి వచించె జాలిమైఁ
"మునిమి, విరోధులన్నగులఁ ♦ దూలితివంచు వధింపఁ; బొమ్మిఁక

స్థనువును, బాణజాలము, ర ♦ థంబును గైకొనిరమ్ము వేగ, నా
సునిశిత బాణధారరుచిఁ ♦ జూడఁగవచ్చును రావణా!" యనన్.

తే. గీ. బంతిమొగములు వెలవెలఁ ♦ బాఱుచుండ
సోకుమూఁకలరాయఁడు ♦ సొచ్చె వీడు
బంతిఱేరుల యొడయని ♦ పట్టి బలము
వినుతిఁ జేసెను జడదారి ♦ వేల్పుతుటుము. 37

తే. గీ. అఖిలబాంధవ సచివసై ♦ న్యాధిపతులు
సమయఁ గడుఁ జింత నొంది రా ♦ క్షసవిభుండు
కుంభకర్ణుని నిదుర మే ♦ ల్కొలుప భటుల
సంప నిభతురంగములఁ ద్రొ ♦ క్కింప నతఁడు.

తే. గీ. గాఢనిద్రను వీడి, య ♦ గ్రజున కెఱఁగి
హితము బోధించి, యతఁ డాగ్ర ♦ హింప వెడలి
సంగరంబున కరుదెంచి, ♦ శైలచరుల
మ్రింగుచున్న నెదుర్కొని ♦ మిహిరకులుఁడు. 39

ఆ. వె. కుంభకర్ణ! రమ్ము; ♦ కుంభిని నినుఁగూల్చి
దివిజబృందములకు, ♦ దిక్పతులకుఁ
బ్రియముఁగూర్తు ననఁగ ♦ భీకరదనుజుఁడు
సింహగర్జనంబు ♦ సేసి పోరె. 40

ఉత్సా. దనుజనాథుసోదరుండు ♦ దర్పమలర శూలమున్
గొని రణంబుసేయ నెదిరి ♦ కోసలక్షితీశుఁడున్
ఘనశరంబు లేసి, నఱికి ♦ కాలుసేతు లంతటన్
వనజసంభవాస్త్రమునను ♦ వసుధఁ గూల్చె నాతనిన్.

తే. గీ. ఘనబలుం డతికాయుఁడు ♦ దనుజనాథు
తనయుఁ డది గాంచి క్రుద్ధుఁడై ♦ యని నొనర్ప
వారుణాస్త్రంబుచేఁ గూల్చె ♦ వసుధ నతని
రాముతమ్ముఁడు; పిదప నా ♦ రావణుండు. 42

తే. గీ. ఆత్మఁ జింతించి, యనికి నిం ♦ ద్రారి ననుప
మేఘముల డాఁగి వాఁ డతి ♦ లాఘవముగ
నస్త్రజాలంబుఁ బఱపుచు ♦ నదిరిచరుల
నర్కకులజుల నొప్పించె ♦ నాహవమున. 43

క. దనుజపతిసూనుఁ డానిశి
వనజభవాస్త్రంబు నేసి ♦ వనచరచయముల్
ఘనశూరుల దాశరథుల
నని మూర్ఛలఁ జేసి చనియె ♦ హర్షముతోడన్. 44

సీ. అజమంత్రిపర నమా ♦ హాత్మ్యంబుచే జాంబ
వద్విభీషణులును ♦ వాయుసుతుఁడు
నస్త్రబద్ధులు గాక; ♦ యవని మూర్ఛితు లైన
భాస్కరవంశదీ ♦ పకులఁ గాంచి
దుఃఖింప; జాంబవం ♦ తుఁడు వల్కె నీరీతిఁ
'గైలాసఋషభశ్రృం ♦ గములనడుమ
నోషధిపర్వత ♦ ముండును సంజీవ
కరణాదు లోషధుల్ ♦ గలవచటను

తే. గీ. భానుఁ డుదయింపకుండఁగ ♦ వానిఁ దెచ్చి
మూరుకొనఁజేయ నెల్లరు ♦ మూర్ఛఁ దేఱి

బ్రిదుకఁగల" రన నుప్పొంగి ♦ పవనసుతుఁడు
వాయువేగముతో గిరి ♦ వరముఁ జేరి. 45

ఆ. వె. ఓషధులను వెదకు ♦ చున్న జా గగునని
పర్వతమును దెచ్చెఁ ♦ బ్రిభువుకడకు
దశరథాత్మజులును ♦ దరుచరగణము లా
గాలి సోక ; లేచి, ♦ కపివరేణ్యు. 46

క. వినుతించిరి హర్షముతో
వనచరశేఖరుఁడు మరలఁ ♦ బర్వతమును దాఁ
గొనిపోయి నిలిపి వచ్చెను
దినకరుఁ డుదయింపకుండ ♦ దివిజులు మెచ్చన్.

క. తనకులజులు దాశరథులు
ఘనశూరులు బ్రిదికి రనుచుఁ ♦ గమలాప్తుండున్
మనమున నుప్పొంగుచుఁ దాఁ
గనవచ్చె ననంగఁ బొడమె ♦ గగనతలమునన్.

క. అంతట వానరు లెల్లరు
సంతోషధ్వానములను ♦ సలుపఁగ దనుజుల్
సంతాపచిత్తులై కడు
బంతంబున మరలఁ బోరి ♦ వసుమతిఁ ద్రెళ్ళన్.

క. తనవారలమరణమునకు
దనుజేశునిసుతుఁడు వగచి ♦ తనజయమునకై
ఘనమఖముఁ జేయఁబూనఁగ
దనుజోత్తముఁ డనియె నిట్లు ♦ ధరణీశునితోన్.

సీ. "అర్కవంశోత్తమా! ♦ యాగ మీడేరిన
దనుజేంద్రసుతుఁ జంపఁ ♦ దరముగాదు
కావున వేవేగఁ ♦ గ్రతువు భంగముసేయఁ
గపిచయంబులను, ల ♦ క్ష్మణుని, శూరు
నంపు నావెంబడి ♦ నన రాముఁ డనుజన్ము
దీవించి పంపెను ♦ దివిజవైరి
యజ్ఞంబుకడకు వా ♦ రరుగ నిశాచరుల్
చండయుద్ధ మొనర్చి, ♦ నమసి; రఘుప
తే. గీ. నవనభంగంబునకు మదిఁ ♦ జాల వగచి
దైత్యపతిసూనుఁ డనిసేయఁ ♦ దనుజకులుఁడు
పటుతరాస్త్రంబు లేసి, ద ♦ ర్పంబు వాపి,
నైంద్రినామాస్త్రమునఁ గూల్చె ♦ నతని నవని. 51

సీ. ఆత్మజుకొఱకు ద ♦ శాస్యుఁడు విలపించి
రణమొనర్చుచు, విభీ ♦ షణుని దునుమఁ
గడగిన ; శరణార్థిఁ ♦ గాపాడ లక్ష్మణుం
డాహవం బొనరింప ♦ నసురవిభుఁడు
దారుణశక్తి నా ♦ తనివక్షమున నాట
మూర్ఛిల్లె, నది గాంచి ♦ భూవరుండు
తరుచరవరులు క ♦ దల్పఁజాలనిశక్తి
నవలీలఁ దీసి, దుః ♦ ఖాశ్రుకణము
తే. గీ. లొలుక నయనాంబుజములఁ, గీ ♦ శులను, గూర్మి
ననుజుఁ గాపాడ నిలిపి, శౌ ♦ ర్యంబు దనర

వాడిశరములఁ బఱపి రా ♦ వణు జయించి,
యనుజుపైఁబడి ఘనచింత ♦ నడలఁదొడఁగె. 52

సీ. "హా! భీమరణశూర! ♦ హా! సద్గుణాకర!
హా! సుమిత్రాతనూజ! ♦ అర్కతేజ!
బాల్యమాదిగ నెడఁ ♦ బాయఁ జాలవు నన్నుఁ
గన్నతండ్రి! యొక్క ♦ గడియయైన;
జిత్తవృత్తి నెఱింగి ♦ సేవించువాఁడవు
నేఁ జెడఁబాయఁగ ♦ నిన్ను విడిచి
మనఁజాల" ననుచు న ♦ మ్మనుజేశుఁ డడలఁగఁ
గపివర్యు లూరార్చి, ♦ గాడ్పుసుతుని

తే. గీ. బంప నాతఁడు సంజీవి ♦ పర్వతమును
దెచ్చె, నోషధిమహిమను ♦ దివ్యతేజుఁ
డగుచు సౌమిత్రి లేవఁగ ♦ నవనినాథుఁ
డనుజు నాలింగనముఁ జేసె ♦ నతిముదమున. 53

తే. గీ. అతులకారుణ్యవీక్షణ ♦ ననిలసూనుఁ
గాఁగిలించెను విభుఁ డంతఁ ♦ గపిగణంబు
సింహనాదంబు లొనరింప ♦ జవి తేశుఁ
జేరి మండోదరి నచించెఁ ♦ జింత నిట్లు. 54

సీ. "దనుజేంద్ర! మనవిని ♦ దయతోడ నాలింపు;
మనవార లెల్లరు ♦ మడిసి రకట!
మును విభీషణుమాట ♦ విననైతి వీరీతిఁ
బుత్రు లెల్లరు రణ ♦ భూమిఁ దెగిరి

మనుజుఁడు గాఁడు రా ♦ మనృపాలుఁ డాచక్రి
దైత్యమర్దనసేయ ♦ ధరణిఁ బుట్టె
నిఁక నైన నాసాధ్వి ♦ నినకులేశున కిచ్చి
శరణుసొచ్చుట సమం ♦ జస" మనంగ

తే. గీ. రావణుఁడు వల్కెఁ "బ్రేమచే ♦ రమణి! యిట్లు
సెప్పెదవుగాని యే నది ♦ చేయ నొల్లఁ,
బౌరుషము వీడి ధరణిని ♦ బ్రదుకుకంటె
రాముచేఁ జచ్చుటయె మేలు ♦ రాజవదన! 55

తే. గీ. పద్మసంభవుఁ గూర్చి త ♦ పం బొనర్చి,
మరణభయనాశకం బగు ♦ వరముఁ గోరు
నాఁడు నరవానరుల విడ ♦ నాడుకతన
నిట్లు వాటిల్లె, ధృతి నూను ♦ మింకఁ దరుణి!" 56

తే. గీ. అనుచు నాసాధ్వి నూరార్చి ♦ యలఘుపద్మ
రాగరుచుల విరాజిల్లు ♦ రథము నెక్కి-
దశశిరంబుల మకుటముల్ ♦ దనర సమర
భూమి కరుదేర రౌద్రుఁడై ♦ రామవిభుఁడు. 57

మ. "అరవిందాసనుఁ డవ్వరం బొసఁగ మ
త్తాంధుండవై మౌనులన్
సురలన్, సాధ్వుల, నెల్లలోకముల సం
క్షోభింపఁగాఁ జేయుచున్
ధరణీజాతఁ బతివ్రతామణిని నా
దారన్ జెఱంబట్టు నీ

దురితంబెల్ల ఫలింపఁజేయుదు" నన౯
దోషాచరుం డుగ్రుఁడై 58

తే. గీ. శౌర్య మంతయు మిగులఁ జా ♦ తుర్యముగను
మాటలనె చూపనేల ? పో ♦ రాటమందు
నీబలముఁ దెల్పు మిఁక రజ ♦ నీచరేశు
ఘనశరాగ్నుల నోర్చు మీ" ♦ వనియె నపుడు. 59

పంచ. ధరాధరద్వయంబు పోరఁ ♦ దాకుభంగి నంత న
ద్ధరాత్మజామనోహరుండు ♦ దైత్యరాజవీరుఁడు౯
బరాక్రమం బెలర్ప నుగ్ర ♦ భండనం బొనర్చ రా
సురాసురల్ వనేచరాళి ♦ చోద్యమంది, చూడఁగ౯.

చ. జయమగుఁగాక! రామునకుఁ♦జండపరాక్రమకీర్తిశాలికి౯
జయమగుఁగాక! యాధరణి♦జాసతిమానసకంజవర్తికి౯
జయమగుఁగాక! యిత్తఱిని♦సత్త్వగుణాన్వితచక్రవర్తికి౯
జయమగుఁగాక!యంచపుడు♦స్వాంతముల న్జపియించి రెల్ల

సీ. అతిలాఘవంబుగ ♦ నసురవల్లభుఁ డేయు రున్.
సాయకనిచయంబు ♦ శౌర్యధనుఁడు
రామభూనాథుండు ♦ రయమునఁ దునుముచు
దానవవిభునిపైఁ ♦ దనశరాళిఁ
బఱప, దైత్యేంద్రుఁ డా ♦ బాణజాలంబుల
ఖండించి, పోరాడు ♦ చుండఁ, బిదప
దశరథసూనుండు ♦ తనఘనాస్త్రములచే
దనుజేశుకరములుఁ ♦ దలలు నఱికి

తే. గీ. మరల మొలవఁగఁ గనుఁగొని, ♦ మనుజవిభుఁడు
మరల మరలను దునుముచు ♦ మరల మొలవ
వెఱఁగునొందుచు, నిది యేమి ♦ వింత ? యనుచు
నలఘువనజాసనాస్త్రంబు ♦ నాత్మఁ దలఁచె. 62

మ. అరిఁ జెండాడ రఘూద్వహుం డలఘుబ్ర
హ్మాస్త్రంబు సంధింప నా
హరినిర్ఘోష మెసంగె దిక్తతుల; బ్ర
హ్మాండంబు కంపించె; నం
బుధిమహోర్ములు ప్రభం దొలంగె; సకలాం
భోరాసు లింకెన్; బయో
ధరముల్ గర్జ లొనర్చె, మూర్ఛిలె సమ
స్తప్రాణులున్ భీతిమై. 63

మ. బల మేపార జగత్ప్రియుండు వడిగా
బ్రహ్మాస్త్ర మేయన్, జగ
త్ప్రళయాభీలదవానలం బన మహో
గ్రజ్వాల లంటన్ దివిన్
జల మొప్పన్ జనుదెంచి, యాఖలుని వ
క్షస్సీమ భేదించె న
[illegible]లికన్ క్ష్మాతలమందుఁ గూల దశవ
క్త్రంబుల్ గడున్ దైన్యతన్. 64

చ. పవినిహతిన్ వడిన్ బడిన ♦ పర్వతరాజముభంగిఁ గూలె దా
నవపతి ధాత్రి; రాక్షసగ ♦ ణంబులు భీతిని బాఱె వీటికిన్

భువి చలియింప, శైలములు ♦ భూరుహములప్పుటుకంప మొంద,
దివిజులు నెల్లలోకములు ♦ దేవతలుఁ గవులుల్లసిల్లఁగన్. భూ

తే. గీ. సమరసప్తాహ మిబ్భంగి ♦ సలిపి వైరి
వర్గమును, విశ్వకంటకు ♦ వసుధఁ గూల్చి
జయవిభాసితుఁ డగునృప ♦ చంద్రుపైన
విరుల గురిసిరి యమరులు ♦ వేడు కలర. 66

తే. గీ. ప్రేమ రావణుసతులు, వి ♦ భీషణుండు
మిగుల విలపింప నూరార్చి ♦ మిహిరకులుఁడు
"ప్రేతకార్యం బొనర్పు మీ! ♦ ప్రీతి" ననిన
నాచరించె నతఁడు భక్తి ♦ నగ్రజునకు. 67

క. జనపతి లంకాపురికిన్
దనుజోత్తము నధిపుఁ జేసి, ♦ తనవిజయంబున్
జనకజకుఁ దెలుప నంపఁగ
ననిలాత్మజుఁ డేఁగి మ్రొక్కె ♦ నవనీసుతకున్. 68

క. "జననీ! విజయము నొందెను
జననాథుం డింక నీవు ♦ సంతోషముతో
దనుజాంతకు దర్శింపఁగఁ
జనుదె"మ్మనఁ బొగడె నిట్లు ♦ జనకజ యతనిన్. 69

ఆ. వె. "అబ్ధి దాఁటి వచ్చి ♦ యరసి, నావార్తను
బార్థివునకుఁ దెల్పి, ♦ ప్లవగవర్య!
నన్నుఁ గాచినాఁడ ♦ వెన్నిజన్మములకు
నీఋణంబుఁ దీర్ప ♦ నేర" ననియె. 70

తే. గీ. "జనని! మీదాసుఁడను గాన ♦ సన్నుతింప
వలదు; నిన్నింతకాలంబుఁ ♦ బలువిధముల
బాధవెట్టిన యీదైత్య ♦ భామినులను
సంహరించెద" ననెఁ దరు ♦ చరవరుండు. 71

తే. గీ. అసురనాథుననుజ్ఞని ♦ య్యతివ లపుడు
బాధవెట్టిరి, నన్నిఁక ♦ వార లేమి
సేయఁజాలరు; కావున ♦ శిక్షసేయఁ
బూనవల" దని చెప్పె న ♦ ప్పుణ్యశీల. 72

తే. గీ. పతిని వీక్షింపఁ దమకింపఁ ♦ బద్మముఖిని
లలనలు సువస్త్రభూషణం ♦ బుల నలంక
రించి, పైడియందలము నె ♦ క్కించి వేడ్కఁ
గోసలేంద్రునికడకుఁ దో ♦ డ్కొని చనంగ. 73

తే. గీ. హర్షశోకాతిశయత నే ♦ త్రాంబుజముల
బాష్పములు జార నాసాధ్వి ♦ ప్రాణనాథు
వదనశశిబింబమును గాంచి ♦ భక్తి గదురఁ
బ్రణుతి నొనరింపఁబూన, భూ ♦ వరుఁడు వలికె. 74

సీ. "అవనిసుతా! విను ♦ మంటరా దిఁక నీవు
నాచరణములు; దా ♦ నవవిభుండు
తరుణిని గొనిపోవ, ♦ దశరథసూనుండు
శౌర్యహీనుఁడు గాన ♦ సతిని విడిచె"
ననుచు ధరాజను ♦ లపహసించెద రని
రణమునఁ గూల్చితి ♦ రాక్షసేశు

బలవంతమున నిట్లు ♦ పరుని గేహంబునఁ
బదినెల లుండ భూ ♦ పతిజలు మిగుల

తే. గీ. సంశయంబునఁ జూడరా ! ♦ సాధ్వి ! నిన్ను
"నసురుఁ డపవిత్రిఁ గావింపఁ" ♦ డనుచు నిపుడు
నమ్మ నేరీతిఁ జెల్లును ? ♦ నాకుఁ ; గాన
నిచ్చవచ్చిన తావున ♦ కేఁగు !" మనిన. 75

క. జనకజ సంతాపముతో
మనమున దుఃఖించుచున్న ♦ మఱఁదికి ననియెన్
"జనపతి విడనాడుటచే
మననొల్లను ధరణి నింక ♦ మనుకులతిలకా ! 76

చ. అనలమునందుఁ జొత్తునిపు♦డగ్నిని బేర్పు" మనంగ దీనుఁడై
దినకరవంశశేఖరుఁడు♦ధీనిధి లక్ష్మణుఁ డన్నఁ గాంచి, యా
జనపతియాననంబునను♦శాంతిని గానక, వహ్నిఁ బేర్పఁగా
ననలునకున్ ధరాపతికి♦నాసతి భక్తిని మొక్కి యిట్లనెన్.

క. "మనమున శ్రీరఘువల్లభు
ననయముఁ బాయనిసుశీల ♦ నని, దివిజులు నీ
యినశశితారాదులు నెఱిఁ
గిన నను రక్షించుఁగాక ; ♦ కృప దహనుండున్

ఆ. వె. చల్లదనము నొసఁగి, ♦ సంతాపమును బాపి
కరుణఁజూపి, నన్నుఁ ♦ గాచుఁగాత !
'యనలదేవ ! నాకు ♦ నభయ మి' మ్మనుచు న
య్యమలచరిత యగ్ని ♦ యందు దుమికె. 79

క. వనచరులు దానవులు న
వ్వనితామణిఁ గాంచి, భీతి ♦ వడఁకుచు నుండన్
వనజాసనాదిదివిజులు
ననలుఁడుఁ బ్రత్యక్షమైరి ♦ యపు డమలకృపన్.

తరల. అసిరధాంగసితాబ్జశార్ఙ్గగదా ♦ రానుషంగ! దురింగితా
డసురగర్వభుజంగరాజవి ♦ హంగ! పక్షితురంగ! శ్రీ
బిసరుహాలయమానసాంబుజ♦భృంగ! నీలశుభాంగ! యీ
వసుమతీసుత నిట్లొనర్పఁగఁ♦బాడియే? రఘుపుంగవా!

ఆ. వె. పూతచరిత సుమ్మ! ♦ భూపుత్రి యీసాధ్వి
యసురనాథువలన ♦ నధికబాధ
లనుభవించుచుండి ♦ యైన నిన్నె మదిఁ
దలఁచుచుండె రామ! ♦ దలఁక కెపుడు." 82

క. అని యమరులు ప్రార్థింపఁగ
జనవిభునకుఁ బ్రీతి నొసఁగ ♦ సాధ్వీమణి నా
యనలుం; డంతట రాముఁడు
కనుఁగవ బాష్పంబు లొలుకఁ ♦ గా నిట్లనియెన్.

క. 'జనకజపావనశీలము
మనమున నా కెఱుకయైన ♦ మహి నెల్లపుడున్
జనములు శంకించెద రని
యనలముఁ జొరఁ జేసినాఁడ! ♦ నందఱు సూడన్.

సీ. ఈసాధ్వి వరశీల ♦ మీధరాస్థలి నింకఁ
బ్రఖ్యాత మగు, సుర ♦ ప్రముఖులార!

యనియె, రఘూద్వహుం ; డంత నాదశరథ
మేదినీకాంతుఁడు మింట నిలిచి
' పరమపతివ్రత వైదేహి ' యని తెల్ప
రామలక్ష్మణులును భూమిసుతయు
నానందపరవశు లగుచు రాజేంద్రున
కతిభక్తిఁ బ్రణమిల్లి రతఁడు సుతుల
తే. గీ. స్నేహమునఁ గౌఁగిలించి యా శీర్వదింప
నాహవంబునఁ జెగినట్టి యదిరిచరుల
రామవిభుకోర్కి దివిజులు బ్రదుకఁ జేసి
యమరధానికి నేఁగి ర య్యధిపుతోడ. 85

సీ. అంత విభీషణుం డాపురంబునఁ గొన్ని
దినము లుండఁగ వేఁడ జనవరేణ్యుఁ
"డబ్దముల్ పదునాలు గయ్యెఁ; గావున నిఁక
భరతుఁ డయోధ్యలోఁ బరితపించు
నొక్కదినం బైన నుండరా"దని చెప్పి
దనుజవల్లభునిచే వనచరులకు
బహుమతు లిప్పించి భక్తి విభీషణుం
డొసఁగఁ బుష్పకము, నాయుర్విధవుఁడు
తే. గీ ధరణినందన సౌమిత్రి దనుజగణము
కపులు రా నెక్కి గగనమా ర్గమునఁ జనుచు
హర్షపూరితమానసుం డగుచు సతికి
విశదముగఁ జెల్పె నచ్చటి వింత లెల్ల. 86

సీ. "సీత ! యిదిగో ! చూడు; ♦ సేతువు; దీనిని
కపులు నిర్మించిరి ♦ ఘనత మెఱయ
దర్భతల్పుఁడ నైతిఁ ♦ దరళాక్షి ! నే నిట
నంబుధి గర్వంబు ♦ నడచునప్పు
డదిగో ! వీక్షింపుమీ ! ♦ యర్కజురాజ్యంబు
కిష్కింధ; యిచ్చటఁ ♦ గీశవర్యు
వాలిని గూల్చితి, ♦ వనజాప్తసూను నేఁ
బొడగన్నఘనఋశ్య ♦ మూక మిదియె
తే. గీ. భూషణములను గంటిఁ బూఁ ♦ బోఁడి ! యిచట
కనుము ప్రస్రవణంబు ల ♦ క్ష్మణునితోడ
వర్షసమయంబుఁ గడపితి ♦ వనజవదన !
యచట, నిన్నుఁ దలంచుచు ♦ నతిభరమున. ౮౯

సీ. పక్షివర్యుని గంటి ♦ భామామణీ ! యిట;
మారీచుఁ దునిమితి, ♦ మగువ! యిచటఁ;
గనుఁగొంటి నిచట ల ♦ క్ష్మణు; నల్లదే పంచ
వటి;" యంచు నెలమి న ♦ వ్వనజముఖికి
విశదీకరించుచు ♦ వేగ భరద్వాజు
నాశ్రమంబున డిగ్గి, ♦ యమ్మహాత్ము
నాతిథ్యమును గొని ♦ యంజనాతనయుని
సాకేతమున కంప ♦ సత్వరముగ
తే. గీ. నతఁడు గంగాతటంబున ♦ కరిగి, నృపుని
గూర్మిసఖుఁ డైనగుహుఁ గాంచి, ♦ కుశలవార్త

నఖిల మెఱిఁగించి, యతనిహ ♦ ర్షాత్ముఁ జేసి
చారుగుణవంతు, భరతు నా ♦ శ్రమముఁ జేరి. 88

సీ. మునివేషధారియై ♦ భూమీశుపాదుకా
ద్వయమును బూజించు ♦ భరతుఁ గాంచి,
రామసందేశంబు ♦ సామీరి తెలుపఁగ
భరతుఁడు సంతోష ♦ భరితుఁ డగుచుఁ
బవననందనునకు ♦ బహుమాన మొసఁగెను
రమణీయరత్నహా ♦ రములఁ బ్రీతి
శత్రుఘ్నుఁ డుప్పొంగి, ♦ సంతోషవార్తను
మాతల కెఱిఁగింపఁ ♦ బ్రీత లైరి

తే. గీ. వీట శుభవార్తఁ జాటింప ♦ వినుచుఁ బ్రజలు
పరమహర్షంబు నొంది రా ♦ ప్రభుని దలఁచి,
పుర మలంకార మొనరింపఁ ♦ భరతుఁ డపుడు
సేవకుల కానతిచ్చెను ♦ జిత్త మలర. 89

సీ. పచ్చపందిళ్ళచే ♦ బాటలు విలసిల్లె
మాణిక్యతోరణ ♦ శ్రేణు లొప్పె
భరతశత్రుఘ్నులు ♦ బంధుమిత్త్రులతోడ
నెదురేఁగి, కనుఁగొని, ♦ యినకులేశు
చరణంబులను వ్రాల, ♦ జనపతి, వారల
నాలింగనముఁ జేసి, ♦ యాదరమున
నందఱకుశలంబు ♦ నరయుచు సాకేత
పురముఁ బ్రవేశింపఁ ♦ బురజనములు

తే. గీ. హర్షమునఁ బొంగి, ఘనసార ♦ హారతుల నొ
సంగఁ, బ్రీతిని గైకొని ♦ సత్వరముగ
రాజమందిరమును జేరి, ♦ రమణితోడఁ,
దల్లులకు మ్రొక్కి, వారల ♦ యుల్ల మలర. 90

సీ. అంత వైదేహి మా ♦ హాత్మ్యంబు నెల్లరు
వినుతింప ; శుభలగ్న ♦ మున మహర్షి
గణములు, జనక కే ♦ కయులు సామంతులు
సకలభూప్రజలు ♦ హర్షమునఁ జూడ ;
భరతుఁడు ఛత్త్రంబుఁ ♦ బట్ట ; సౌమిత్రులు
చామరంబుల వీవఁ, ♦ జరణకమల
ముల నాంజనేయుం డ ♦ మలభక్తి నొత్త ; ధ
రాత్మజతోడఁ బ ♦ ట్టాభిషిక్తుఁ
తే. గీ. డై, ముదంబున శ్రీరాముఁ ♦ డవనిసురుల,
నఖిలబాంధవమిత్త్రుల ♦ నద్రిచరుల,
నర్హసత్కారముల నంపి, ♦ యలఘుబాహు
శౌర్య మలరార నేలె భూ ♦ చక్ర మెల్ల. 91

సీ. దయచేతఁ బ్రజలను; ♦ దానంబులను విప్ర
వరుల; మఖంబుల ♦ సురగణముల;
గురుజనంబుల భక్తిఁ; ♦ గూర్మిని దమ్ములఁ
బ్రీతి బాంధవులను; ♦ బ్రేమ సతిని
దర్పణంబులఁ బిత్రు ♦ దైవంబులను; గడుఁ
దృప్తులఁ జేయుచు; ♦ దిశలయందుఁ

దనకీర్తి భాసిల్ల; ♦ ధర్మదేవత నిల
నాల్గుపాదంబుల ♦ నడువఁజేసె

తే. గీ. నమ్మహీనాథు గొలిచి, వ ♦ ర్ణాశ్రమాది
ధర్మతత్పరులై వసు ♦ ధాజనంబు
లీతిబాధలు; దుర్జన ♦ భీతి యెట్టి
వో ! యెఱుంగక సుఖ మొందు ♦ చుండి రెపుడు.

ఉత్సా. మంగళంబు ; రామునకును♦మాన్యచరిత సీతకున్
మంగళంబు; లోకములకు♦మానసమునఁ గోరెదన్
మంగళాంగుఁ డెపుడు మహికి♦మంగళమును గూర్చెడిన్
మంగళంబు లొసఁగుఁగాక! ♦ మాకు రాముఁ డిచ్చలున్.

## —♦ ఫలశ్రుతి ♦—

కం. రామునిచరితముఁ జదివినఁ
బ్రేమ సుఖంబులను రామ ♦ విభుఁ డిచ్చును సా
ధ్వీమణి ధరణీసుత కృపఁ
గామితముల నొసఁగి, జనుల ♦ కలుషముఁ బాపున్.

ఉ. శారదచంద్రకుందఘన♦సారవిరాజితకీర్తిసాంద్ర! శృం
గారవిహార! దైత్యపతి♦దర్పవిదారక! మానిమానసాం
భోరుహచంచరీక ! ఫణి♦భూషణచాపవిఖండనోత్సుకా!
నీరదనీలగాత్ర! నను♦నీకృపఁ గావుము; రామభూవరా!

## —* గ ద్య ము *—

ఇది శ్రీమద్గుంటూరుపురఖేల వేణుగోపాల వరప్రసాదలబ్ధ
కవిత్వ శాండిల్యసగోత్ర మాచిరాజు సౌభాగ్యలక్ష్మ్యాం
బికా సుబ్బరాయామాత్యతనూజ, కౌండిన్యసగోత్ర
దేచిరాజు శేషాంబారామచంద్రరాయతనూభవ
రామరాయాఖ్య ధర్మపత్న్నీ లక్ష్మీనరసమ్మ
నామ్నా విరచితం బైన శ్రీరామచరిత్రం
బనునిర్వచనకావ్యంబునఁ
యుద్ధకాండము,
సర్వంబును
సంపూర్ణము.

శ్రీసీతారామపరబ్రహ్మార్పణ మస్తు.

—※—

గుంటూరు, చంద్రికాముద్రాక్షరశాలయందు, ముద్రింపఁబడినది.